

# నాడీ జ్యోతిషం



రచన

**భాగవతుల సుబ్రహ్మణ్యం**








# అంగుష్ఠ నాడీ జ్యోతిష్యం

## ప్రస్తావనము

జ్యోతి అంటే వెలుగు. జ్యోతిష్యం అంటే వెలుగు నింపేది. ఎంతో ప్రాచీనత గల ఈ శాస్త్రానికి వేదంలోనే పునాదులు ఉన్నాయి. దీనిలో అంతర్భాగాలే సాముద్రిక శాస్త్రం, నాడీ జ్యోతిషం మొదలైనవి.

ప్రత్యేకంగా పరాశర సంహిత వంటి గ్రంథాలలో ఎన్నో విశేషాంశాలు చోటు చేసుకున్నాయి. అలాగే జాతక పారిజాతము కూడా!

ఇట్టి మహత్తర గ్రంథ రాజాలను మదించి ఉత్తరాధి పండితులు కాలానుగుణమైన జ్యోతిష గ్రంథాలు రూపొందించుకున్నా ఆ ప్రయత్నాలు దక్షిణాధి భాషల్లో అంతగా జరగలేదనే చెప్పాలి.

తెలుగులో - కేవలం నాడీ జ్యోతిష విభాగంలోనే నూతన అంశంగా ఈ అంగుష్ఠ నాడీ జ్యోతిషం, భవిష్యత్తు తెలుసుకోగోరే వారికి అనుగుణంగా రూపకల్పన చేసి సమర్పిస్తున్నాం! మీ ఆదరణ తథ్యమని విశ్వసిస్తున్నాం !

ప్రచురణకర్తలు



# విషయ సూచిక

# నవీన మార్గం

సాముద్రిక శాస్త్రంలో నాడీ జ్యోతిష విభాగం నిజంగానే ఒక నవీన మార్గం. ఈ జ్యోతిష శాస్త్రాన్ని అంగుష్ఠం (బొటనవ్రేలి) ప్రాతిపదికగా చేసుకొని మన ప్రాచీన మహర్షులు అభివృద్ధి చేశారు.

ఒకానొక కాలంలో విస్తృత ప్రచారంలో ఉన్న ఎన్నో మనవైన అపురూప శాస్త్రాలలో మణిదీపాలనదగ్గ గ్రంథాలు సరిగ్గా వినియోగించేవారు లేక మరుగున పడిపోయాయి.

గర్గుడు, పరాశరుడు వంటి వేద ఋషుల విజ్ఞానం ఈ జ్యోతిష, సాముద్రిక, నాడీ శాస్త్ర పరంగా భావితరాలకు పదిలపరచాలనే సత్సంకల్పంతో - ఈ అంశాన్ని క్రోడీకరించే గ్రంథంగా ఇది రూపొందించడం జరిగినది.

అంగుష్ఠాన్ని ప్రామాణికంగా తీసుకొని వివిధ నాడుల (మార్గాల) వర్గీకరణలను సైతం ఈ గ్రంథం ప్రయోగ భాగంలో అందించాం! అవధరించండి !

- సంకలనకర్త

# నాడీ జ్యోతిషం

## ప్రథమ భాగం

### భవిష్యత్ చెప్పే దిశగా అంగుష్ఠనాడీ జ్యోతిషం

రేపు ఏం జరుగనున్నదో తెలుసుకోవాలని ఎవరికి ఉండదు? అందుకు జ్యోతిశ్శాస్త్రం, హస్తసాముద్రికం వంటివి ఎన్నో సహాయకారులుగా ఉన్నాయి. అలాంటిదే నాడీ జ్యోతిషం కూడా!

భవిష్యత్తుని సూచించడంలో, బొటనవ్రేలు - దాని మీద రేఖల ప్రాధాన్యతను మన శాస్త్రవేత్తలతో సహా జ్యోతిర్గణిత విశారదులు సైతం సప్రమాణికంగా నిరూపించారు. మస్తిష్కంతో నేరుగా సంబంధాన్ని కల్గి ఉండి, అంతరాత్మలో నిక్షిప్తమైన శక్తుల్ని ప్రేరేపించగలగడంలో బొటనవ్రేలి పాత్ర అసాధారణమైనది. అంతేకాదు! వ్యక్తిత్వ వికాసంలోను - ఒక వ్యక్తి యొక్క ఆత్మవిశ్వాసాన్ని ప్రతిబింబించడంలోను దీన్ని మించిన సూచిక మరొకటి లేదు. బొటనవ్రేలి రేఖల క్రిందుగా అల్లుకున్న నాడీ కేంద్రాలు, శరీరమంతటికీ విస్తరించి మొత్తం శరీరం మీదనే ప్రభావం చూపిస్తాయి. రాబోవు అంశాలను తెలియజెప్పగల దిశగా, దీని ప్రభావాన్ని ఈ పుస్తకంలో విస్తృతంగా చర్చించడం జరిగింది.

కనుకనే - దీన్ని 'అంగుష్ఠ నాడీ జ్యోతిషం' అని ప్రత్యేకమైన విభాగంగా పరిగణిస్తున్నారు!

### హస్తసాముద్రికానికి ఇదో అదనపు జోడింపు

సాముద్రిక వేత్తలు మీ చేతిని పరిశీలన నిమిత్తం తీసుకున్నపుడు, మీ బొటనవ్రేలి రేఖల మీద తమ దృష్టి యావత్తూ కేంద్రీకరిస్తారనే విషయం మీకు బహుశా తెలీకపోవచ్చు! కాని అది వాస్తవం. అనుభవజ్ఞులైన హస్తసాముద్రికుల ప్రథమ వీక్షణం, ప్రధానంగా మీ అంగుష్ఠం (బొటనవ్రేలు) మీద మొత్తం ఏమున్నదీ పరీక్షిస్తుంది. అందుకు ఒకే ఒక్క కారణం ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే అంగుష్ఠం, మనిషి జీవిత రేఖలను శాసిస్తుంది.

జీవాత్మ (eternal soul) ను ప్రభావితం చేసే శక్తిగల బొటనవ్రేలి సామర్థ్యం **శ్వేతాశ్వరోపనిషత్**లోని ఈ శ్లోకం తేటతెల్లం చేస్తుంది.

**శ్లో ॥ *అంగుష్ఠమాత్రో రవి తు తం రూప***
***సంకల్పా హంకయ స మాంధితో మః ॥***
***కురుతే ర్గుణో నాత్మ గుణేన చైవ***
***ఆరాగమాత్రో హ్యవరో దథి దృష్టః ॥***

వేదాలలో ఇక్కడ అంగుష్ఠ శబ్దానికి సారస్వత అర్థం గాకుండా, అంతరాత్మ సంబంధమైన అర్థాన్ని గ్రహించాలి.

ఉపనిషత్‌ల ప్రకారం రజ, స్సత్వ, తమో గుణాలు త్రిగుణాలని చెప్పబడ్డాయి. ఇవి త్రిమూర్తులకు ప్రతీకలు. సత్వగుణం బ్రహ్మ సంబంధి. రజో గుణం విష్ణు సంబంధి. తమోగుణం శివ శక్త్యాత్మకం.

**కఠోపనిషత్**లో చెప్పినట్లుగా - చావు పుట్టుకలను నియంత్రించేది పరమాత్ముడే అయినప్పటికీ, మరణాన్ని శాసించేది మాత్రం యమధర్మరాజే! కాలం తీరగానే మానవుల ఉసురులను గొని పోగల ఘనుడు. అయితే ఈ ఉసురనేది మానవ దేహంలో ఎక్కడుంటుంది? అంతర్దేహంలోనే సరిగ్గా నట్టనడిమిన అంగుష్ఠ మాత్రంగా అధివసించి ఉండేదే ఈ అంతరాత్మ. భూత భవిష్య వర్తమానాదుల్ని తెలియజేసే శక్తి కూడా ఇదే ప్రమాణం గల బొనటవ్రేలే కావడం గమనార్హం!

"ఈశానో భూత మ్యస్య స ధవాధ స ఉ స్వః". మార్పు చెందించలేనిదీ - ప్రభావిత పరచలేనిదీ (మరణాన్ని) కాలం ఒక్కటే! కాని.... రేఖలు అలా కాదు! కొన్ని కొంతకాలం తర్వాత మాయమవుతూంటాయి. ఒక్క బొటనవ్రేలి రేఖలకు మాత్రం ఈ విషయంలో మినహాయింపు ఉంది. ఇవి నశించవు. మార్పు చెందవు. జననం నుంచి మరణం దాకా దీని మీది రేఖలు ఒకేలా ఉంటాయి.

ఎలిజబెత్ పి. హోఫిమన్ చెప్పినట్టు - 'బొటనవ్రేలు ధ్వజంలా పైకి లేస్తే జీవితం; క్రిందికి వాలిపోతే జీవం కోల్పోవటమే!"

రష్యన్ వైజ్ఞానికులు ఇటీవలే ప్రకటించినదాన్ని బట్టి, ఒక వ్యక్తి దీర్ఘ రోగ గ్రస్తుడవుతాడా? లేడా? అన్నది కూడా బొటనవ్రేలు చూసి నిర్ధారించవచ్చునట! (ఉదాహరణ : పోలియో, పక్షవాతం వంటి వాటి బారిన పడటం అన్నమాట.)

ప్రపంచ ప్రఖ్యాత హస్తసాముద్రికుడు, నోబెల్ బహుమతి గ్రహీత అయిన జాక్విన్ తన 'హ్యూమన్ హ్యాండ్' (మానవ హస్తం) అనే పుస్తకంలో ఇలా సెలవిచ్చాడు - అన్ని విధాలైన శక్తులనూ.... అవి మంచివి కావచ్చు! చెడువున్నా కావచ్చు! కలిగినటువంటి సజీవ సంకేతం అంగుష్ఠం'' అని. ఎవరి బొటన వ్రేలు అయినా రోగగ్రస్తమై వాలిపోతున్నట్లుగా ఉంటే, వారికి కొద్ది గంటల్లో మరణం సమీపించనున్నదని చెప్పవచ్చునట! కాని అదే బొటనవ్రేలు పైకి స్థిరంగా ఉంటే మాత్రం, అదే ఆ వ్యక్తి జీవితాన్ని శాసిస్తుంది. దీంతో మనకు అర్థం అవుతున్న అంశం - అసలు ప్రాణం బొటనవ్రేలే. (లేదా) ఆ ప్రమాణంలో గల అంతరాత్మ అనీ అర్థం చేసుకోవచ్చు!

'దక్షత'గల బొటనవ్రేలుని మరో విధంగా నిర్వచించారు మన ఋషులు. ఇది లేకపోతే ఏదీ పట్టుకోబడదు. ఏ విద్యా పట్టుబడదు. ఏకలవ్యుడిని పట్టి కొట్టించడానికి ద్రోణాచార్యుడు, కేవలం ఈ వ్రేలిని మాత్రమే అడగడంలో అంతరార్థమిదే!

మన హస్తం ముఖ్యంగా మూడు వ్రేళ్ల కదలికల ద్వారా గొప్ప జ్ఞానదాయినిగా భాసిస్తోంది. అవే 1) బొటనవ్రేలు 2) చూపుడు వ్రేలు 3) మధ్యవ్రేలు. ఈ వ్రేలునే బృహస్పతి (జుపిటర్) వ్రేలు అనీ అంటారు. జ్ఞాన సముపార్జనకు (సరస్వతికి) ఆలంబన.

నేసీ మెకెంజీ అనే మరో ప్రముఖ సాముద్రికుని అభిప్రాయరీత్యా ''ఒక వ్యక్తి యొక్క తార్కిక దృష్టికి గానీ - తాత్విక చింతన గ్గానీ బొటనవ్రేలిని పరిశీలించడం ఎంతో ముఖ్యం.... అన్న దాంట్లో అతిశయోక్తి ఉండబోదు.''

జీవజాతుల్లో ఒక్క మనిషి బొటనవ్రేలు మాత్రమే మిగతా వ్రేళ్లను భిన్నంగా ఉంటుంది. ఒక చింపాంజీని గాని, కోతిని గాని బాహ్యశరీరం మొత్తంగా పోలి వున్నప్పటికీ - చేతుల దగ్గరకు వచ్చేసరికి తేడాగా ఉండడం మాత్రమే కాదు! ఈ బొటనవ్రేలికీ - చూపుడు వ్రేలికీ అంతర్గతంగా సంబంధం చాలా బలహీనంగా ఉంటుంది. తెలివీ - ఆత్మవిశ్వాసాలూ వాటిలో తక్కువగా ఉండటానికి ఇదీ ఒక కారణం! ఒక హంతకుడి బొటనవ్రేలిని విశ్లేషిస్తే

అది చాలా మందంగా ఉండడం మాత్రమే కాక, పొట్టిగా కూడా ఉంటుందని తేలింది. దీని ఆకృతీ - పరిమాణం అన్నీ పరిగణనలోకి తీసుకొని చూస్తే, అటువంటి వ్యక్తి జన్యుపరంగానే మానసిక వైకల్యం కలిగి ఉండి అతిచిన్న బలహీన బొటనవ్రేలు కలిగి ఉన్నట్లు తేలుతోంది.

రోమన్ల అభిప్రాయం ప్రకారం పొట్టి లేదా కురచగా ఉండే అంగుష్ఠం పశుప్రాయులకు మాత్రమే ఉంటుంది. ఇదే ఇంగ్లీషు వారి దృష్టిలో పుంసత్వహీనతకు చిహ్నం. ఫ్రెంచి వారి లెక్క ప్రకారం - పొడుగైన బొటనవ్రేలు సాంస్కృతిక - గౌరవప్రద - తార్కిక - తదితర ఉదాత్త శక్తుల మేలుకలయిక.

న్యూయార్క్‌లోని ప్రముఖ విద్యావేత్త జార్జి విలియం బెన్‌హామ్ తన 'ది లా ఆఫ్ సైంటిఫిక్ హ్యాండ్ రీడింగ్'లో ఇదే అభిప్రాయాన్ని బలపరిచాడు.

పారిస్‌లోని ప్రముఖ హస్తసాముద్రికుడు డెస్బరాలియస్ చేసిన ఛాలెంజ్ ప్రకారం "ఏ ఇద్దరి హస్తరేఖలూ ఒకే తీరుగా అచ్చుగుద్దినట్లుండవు. సూక్ష్మమైన తేడాలైనా ఉండి తీరుతాయి! అలా ఒకే పోలికతో అన్ని రేఖలూ ఏ ఇద్దరు వ్యక్తులకైనా ఉన్నట్టు రుజువు చేయగలిగితే - నేను అటువంటి వారికి జీవితాంతం పాదసేవ చేస్తాను" అన్నాడు.

నిజం కూడా ఇదే! రూపురేఖలే కాదు - హస్తరేఖలూ, ఆకృతీ, భావజాలం, ఆలోచనా సరళీ ఏ ఇద్దరు వ్యక్తులకూ ఒకే తీరులో ఉండదన్నది విశ్వవ్యాప్త సత్యం! కవలలకైనా సరే! ఏదో చోట చిన్న తేడా ఉంటుంది. ప్రతివ్యక్తీ తనదైన ముద్ర కలిగి ఉంటాడన్నది సుస్పష్టం!

ప్రతి జీవి క్రోమోజోమ్‌ల వ్యవస్థ, అతడి లేదా ఆమె జన్యుపట చిహ్నాలకు సూచిక. అయితే ఇవి మార్పులకు గురి అవుతూండవచ్చు! కాని, ఏ మార్పూలేని అరచేతి రేఖలు, మటపల్లాలను బట్టి ఒక వ్యక్తికి ఏదైనా రోగం ఉన్నదీ లేనిదీ ప్రాథమిక దశలోనే కొన్ని పరిశీలనల ద్వారా రుజువు చేయవచ్చు! ఇలాంటి రోగనిర్ధారణా విధానం ద్వారా కొన్ని రోగాలకు చికిత్స చేయవచ్చునని 1977లో మిన్స్క్ మెడికల్ ఇన్‌స్టిట్యూట్, రష్యా వారు రుజువు చేశారు. జన్యు పరిశోధనలలో, నిర్ధారణ రీతులలో ఇదొక మైలురాయి. డా. యుసోవ్ ఈ పరిశోధనలను దీక్షగా కొన్నేళ్లపాటు పర్యవేక్షించారు.


Microscopic Analysis

ఉసోవ్ దాదాపు 2 లక్షలకు పైగా పరిశీలనలు జరిపి, రేఖలు - వాటిదశ - ఎత్తు పల్లాలు అన్నీ శోధించాడు. ఇందులో భాగంగానే జన్యుశాస్త్రపరంగా అసాధారణ స్థితులనూ అధ్యయనం చేశారు.



వీటిని కొన్ని పట్టికల, పటాల రూపంలో నర్సింగ్‌హోమ్‌ల కోసం పొందుపరచారు. బెలెరూసె డయాగ్నస్టిక్ సెంటర్ ద్వారా ఈ పట్టికలు అద్భుత ఫలితాలు సాధించాయి కూడా!

## కవలలు, జ్యోతిషం

ఒకే రాశి కూటమికి చెందిన లక్షలాదిమంది జనులకు ఒకే రాశికి చెప్పబడిన ఫలితాలు వర్తించవు. జ్యోతి శ్శాస్త్రం మొత్తం 9 గ్రహాలు 12 రాశులపైన ఆధారపడింది. ఒక కవలల జంట ఒకే ప్రదేశంలో ఒకే సమయంలో జనించినట్లుగానే, వేరే ప్రదేశంలో అదే సమయంలో ఇంకో కవలల జంట జనించినా జ్యోతిశ్శాస్త్ర ఫలితాలు వేరేలా ఉండొచ్చు! అంతేకాదు! కవలల చేతిరేఖలు సైతం ఒకేలా ఉండకపోవచ్చు!

ఒక్క బొటనవ్రేలిలోనే 3000 వరకూ అతి సూక్ష్మరేఖలుంటాయంటే, మొత్తం అరచేతిలో ఎన్నుంటాయో మనం తేలిగ్గానే ఊహించుకోవచ్చు! సాధారణంగా ఎడమచేయి రేఖలు గత జీవితాన్ని సూచిస్తే, కుడిచెయ్యి రేఖలు భవిష్యత్ సూచికలు

ముఖ కవళికల్ని చెప్పే ముక్కు ఎలాంటిదో, సాముద్రిక శాస్త్రంలో బొటనవ్రేలు అలాంటిది అంటారు సాముద్రిక దీపిక గ్రంధకర్త పండిట్ లక్ష్మీనారాయణ త్రిపాఠీ.

నక్షత్ర గణన, రాశిసంచారం, డిగ్రీలు వగైరా బాగా తెలిసిన జ్యోతిష్కులు, మంచి జాతక చక్రాన్ని గీయడానికి - జ్యోతిస్సాముద్రిక శాస్త్రాన్ని వాడుకోవడమనేది ఇక అట్టే దూరం లేదు అని విజ్ఞుల ఉవాచ.

'బాగా పరిశీలించిన మీదట రాశుల, నక్షత్రాల గుర్తులన్నీ మేం వ్రేళ్ల రేఖల మీదే ఉన్నట్టు తెలుసుకోగలిగాం!' అన్నారు ప్రాచీన మహర్షులు.

శ్రీలంక విద్యావేత్త ప్రొ. సైరస్ అవైక్విన్ చెప్పినట్లు - 'ఒక క్రొత్త వ్యక్తిని అంచనా వేసి మనం ఓ అభిప్రాయానికి రావడానికి అంగుష్ఠాన్ని పరీక్షిస్తే చాలు! అదే గొప్ప తీర్పరి''.... మరి!

## నాడీ జ్యోతిషం మిష్టరీ :

సప్తవర్గు, నవవర్గు (అంశ పద్ధతి) కట్టడం జ్యోతిషంలో ప్రాచీన సంప్రదాయం. జ్యోతిశ్శాస్త్ర విశారదులల్లో ఇప్పటికీ ఒక్క కీరో పండితుడ్ని మాత్రమే గాక, పశ్చిమదేశాలు చాలామంది జ్యోతిర్గణిత వేత్తలని మన్నిస్తున్నాయి. ప్రామాణికంగా తీసుకుంటున్నాయి.

చాంద్రమాన సౌరమాన పంచాంగాలతో, ఏ నిమిత్తం లేకుండా - జన్మలగ్నం అంచనా వేయడం సాధారణంగా సాధ్యం కాదంటారు. కాని హస్తరేఖల్లో దాగిన గ్రహస్థితుల్ని బట్టి అంత ఖచ్చితంగానూ జన్మలగ్నాన్ని నిర్ణయించవచ్చు! అయితే దీన్ని ఒక విజ్ఞానశాస్త్ర దృష్టితోనూ - తృష్ణతోనూ చూస్తేనే సాధ్యం!

"దైవ దత్తమైన వరంవల్ల ఏ కొద్దిమందో మాత్రమే చదవగలిగే షార్ట్‌హ్యాండ్ తరహా దైవ పరిభాష జ్యోతిషం''.

అయితే దీన్ని ఓపికతో, జిజ్ఞాసతో అందరూ అభ్యసించవచ్చు! ముఖ్యంగా హస్తసాముద్రికంలో కొద్దిపాటి ప్రవేశం ఉన్నవారికి, నాడీజ్యోతిషం తెలుసుకోగల్గడం అంత కష్టమేమీ కాదు. కావలసిందల్లా తపన.

ఈ పుస్తకం సరస్వతీ చరణారవిందాలకు సమర్పణ గావిస్తూ, మేము స్పష్టం చేస్తూన్న అంశం ఒకే ఒక్కటి!....

దీనిని సాధ్యమైనంత వివరంగా మీకు అందించామనే భావిస్తున్నాం! ఇంకా ఇందులో ఈ అంగుష్ఠ జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించి ఏవైనా మార్పు చేర్పులుంటే తప్పక సూచించాల్సిందిగా కోరుతూ ఉన్నాం! మలిముద్రణలలో అవి చేర్చగలమని హామీ ఇస్తున్నాం!

దైవదత్తమైన జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానాన్ని పరిరక్షించే జ్యోతిశ్శాస్త్రవేత్తలంతా ఈ కొత్త వెలుగును మనసారా స్వాగతిస్తారని ఆకాంక్షిస్తున్నాం!

# 1. నాడీజ్యోతిషం ఏయే అంశాలు చెప్పగలదు?

ఒక్కోసారి చాలా గొప్ప సత్యాలు సైతం అతిచిన్న వాటిలో ఇమిడి ఉంటాయి. - కీరో

చాలామంది ప్రముఖ హస్తసాముద్రికులు - భవిష్యద్దర్శకులు హస్తంలో అతి ముఖ్యభాగమైన బొటన వ్రేలిని - దాని ప్రాముఖ్యాన్ని ప్రస్తావించారు. కాని ఎవరూ కూడ దీని ప్రాశస్త్యాన్ని వివరించేందుకు ప్రత్యేకంగా ఒక్క పుస్తకాన్ని కూడా వెలువరించలేదు. ఈ విషయంపై ఈ దిశలోనే రాసిన మొట్టమొదటి పుస్తకం ఇది

ఈ 'కొత్త' నాడీ జ్యోతిష్యంలోని ముఖ్యాంశాలను, మనం బొటనవ్రేలి పరీక్షద్వారా తెలుసుకుందాం!

ప్రేమ, విద్య, పటుత్వం లేదా సామర్ధ్యం, మానసిక స్థితి, ఆయుర్దాయం, మనలో లోపాలు, గర్వం, తర్కబుద్ధి, పిత్రార్జితం, సోదరులెందరు?, వారితో సత్సంబంధాలు, శత్రు మిత్రాదులు, దైవభక్తి, కళావికాసం, ప్రత్యేక అంశాల పట్ల శ్రద్ధ, ఏ రంగంలో నిష్ణాతులవుతారు?, న్యాయ సంబంధ అంశాల్లో విజయం వరిస్తుందా? లేదా?, ఆత్మవిశ్వాసం, రాజు అవుతారా? పకీరవుతారా? దొంగ అవుతారా? సన్యాసి అవుతారా? జన్యుసంబంధిత వికృతులు లేదా విశేషాలు, దేహధారుఢ్యం, ప్రాణ చలనం.... ఇలా ఒక్కటేమిటి? ఎన్నో అంశాలు చర్చించగలదు. అవన్నీ మున్ముందు వివరిస్తాం!

## మానవ పరిణామ విశ్లేషకుల సర్వే ప్రకారం :

మానవ పరిణామ శాస్త్ర పరిశీలకులు (Anthropologists) ఇటీవల ఒక కొత్త అంశాన్ని కనుగొన్నారు.

మానవ శరీరంలోని ముడుతలు, వంపులు అంత ప్రాధాన్యత సంతరించుకోకపోవచ్చు! కాని, అరచేతిలో లేదా బొటనవ్రేలి మీద ముడుతలు, మిట్టపల్లాలు కొన్ని రకాల వనచరాలలోన (హౌలర్ కోతులు వగైరా), చారల గుర్రాల్లోన కొంత ప్రాధాన్యత కలిగి ఉన్నాయిట!





Zebra

ఈ తరహాకు చెందిన (ఇలాంటి ఒక పరిశోధనా సంస్థల్లో ఇదే మొదటిది కూడా) ఓ సంస్థ 1892లో సర్‌ఫ్రాన్సిస్ గాల్టిన్ ఆధ్వర్యంలోని జరిపిన వివిధ జంతు చర్మ అధ్యయన శాస్త్రంలో పైన చెప్పిన జంతువుల శరీరాలపై ఇలాంటి అతి సూక్ష్మమైన ముడుతల్ని రేఖల రూపంలో కనుగొన్నారు. ఇవి వేర్వేరు జంతు జాతులకు భిన్న రీతులలో కన్పించాయట!

ఈ సూత్రాన్ని మానవులకు (ముఖ్యంగా అరచేతుల్లోని రేఖలకు అన్వయించి పరిశీలనలు జరిపినపుడు కొన్ని రేఖలు ఒకే తరహాకు చెంది, ఆయా వ్యక్తుల్లో దాగిన దీర్ఘ రోగాల్ని, వర్ణాంధత (Colour Blind–ness), శరీర వర్ణం, చర్మ స్వభావం.... ఇలా ఎన్నో అంశాలకు సూచికలుగా తేలినట్లు ఇండియా, పోలెండ్‌లలో వెల్లడైంది. ఇది ముమ్ముందు అధ్యాయాల్లో చర్చిద్దాం!

## 2. జ్యోతిష్యులు చెయ్యి చూడ్డానికి గల కారణాలు

స్త్రీలకు ఎడమ చేతినీ, పురుషులకు కుడి చేతినీ చూసి ఫలితాలు చెప్పాలని గర్గుడు మొదలైన మన మహర్షులు ఏనాడో సిద్ధాంతీకరించారన్న అంశం మీకు తెలిసిందే!

కొందరు పండితుల అభిప్రాయం ప్రకారం - కుడిచేయి భవిష్యత్తుకు సూచిక అయితే, ఎడమచేయి గడిచిపోయిన జీవితానికి సూచిక. మరికొందరు పురుషుని ఎడమచేయి, అతడి భార్య జాతక సూచిక అన్నారు.

దీంతో చిన్న గందరగోళ పరిస్థితి నెలకొనే ఛాన్సుంది. స్త్రీకైనా, పురుషునికైనా ఏ చేయి చూడాలి అనేదే ఆ సమస్య.

దీనికి ప్రాచీన రుషుల సమాధానం ఈ విధంగా వుంది. పురుషుని ఎడమచేయి గత రెండు జన్మలకు సూచిక అట!

వైదిక పరిభాషలో స్త్రీని 'వామాంగి' అన్నారు. కానీ - భర్తను బట్టి భార్యకు ఈ సమాజంలో స్థానం ఉంటుందన్నది అందరికీ తెలిసిన సంగతే! బైబిలు కూడా ఈ విషయాన్నే ధృవీకరిస్తున్నది.

"ఆమె కుడిచేతి యందు దీర్ఘ దినములు, ఎడమచేతి యందు సంపద్గౌరవములు గలవు." (సామె 3వ అధ్యా - 16 వాక్యం)

14 ఏళ్లలోపు బాలలకు స్వయం పోషక శక్తి లేనందున, ఎడమచేయి చూడాలి.

ఇక్కడ ఇంకో విషయం కూడా పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. పురుషుడైనప్పటికీ - అతడు పిరికివాడయి ఉండి, స్వయం పోషకశక్తి లేక ఇతరులపై ఆధారపడి ఉన్నట్టయితే అతని ఎడమచేతిని పరిశీలించాలి. అదే ఒక స్త్రీ స్వతంత్రురాలిగా తన ప్రతిభతో వెలుగొందేలా వుంటే ఆమె కుడిచేయి పరీక్షించాలి.

సార్వజనీనంగా చెప్పాలంటే - కుడిచేయి రేఖలు వర్తమాన/ భవిష్య సూచికలు గాను; ఎడమచేయి రేఖలు గడచిన జీవిత సూచికలుగాను గుర్తించాలి

జ్యోతిష్యాంశ రీత్యా - కుటుంబ సంబంధాలు, కీర్తిప్రతిష్ఠలు, ఆకస్మిక భయాలు (ఫోబియా) వగైరా ఎడమచేయి చూసి చెప్పాలి. వర్తమాన - భవిష్యత్ అంశాలు చెప్పడానికి గతంలో జరిగిన అంశాలు ఆధారం కనుక రెండు చేతులనూ పరిశీలించి చెప్పడం ఉత్తమం!

సంసార సౌఖ్యం - సంతాన విషయాలు చెప్పడంలో చాలామంది అనుసరించే విధానం దంపతులలో ఒకరి చెయ్యి చూడడం! కాని, ఇది సరికాదు. ఇద్దరి చేతులూ పరిశీలించాలి. ఎంతమంది పిల్లలున్నారు? అనే అంశం ఒక వ్యక్తి భార్య హస్తం చూసి చెప్పవచ్చు!

జాతకంలో 'కళత్రమూల యోగం' ప్రకారం 7వ ఇంట, 9వ ఇంట అధిపతి ఎవరున్నారో నిర్ణయించడానికి ఇద్దరి చేతులూ చూడాలి. గుర్తుల - రేఖల విషయంలో దంపతులిరువురి రేఖా విన్యాసాలు సరిగ్గా సరిపోలనపుడే, జ్యోతిష్యానికి ఫలితాలు చెప్పడంలో కొంత అవరోధం కల్గుతుంది. ఇలాంటివి జాగ్రత్తగా చూడాలి!

## 3. బొటనవ్రేలి రేఖలు మార్పు చెందవా?

అంగుష్ఠం పైన ఉండే రేఖలు గాని, ముడుతలు గాని పుట్టిన దగ్గర్నుంచి మరణించే దాకా ఎలాటి మార్పులకూ లోనుగాక ఒకే రీతిలో ఉంటాయి. పునః పునః చెప్తున్నట్లు

భావించకపోతే - సృష్టిలో ఏ ఇద్దరివీ..., చివరకు కవలలు అయినా సరే! వారి రేఖలు గానీ, గుర్తులు గానీ ఒకే తీరులో ఉండవు.

అందుకనే పోలీసులు ముఖ్యంగా నేరస్తుల్ని గుర్తించడంలో వ్రేలిముద్రలనే ఆధారం చేసుకుంటారు. జన్యుశాస్త్ర సంబంధిత వికృతుల్ని కనిపెట్టడానికి వైద్యశాఖ కూడా కొన్ని చేతిరేఖలను ఆధారం చేసుకుంటుంది. ఇదే సూత్రం జ్యోతిర్గణకులకూ వర్తిస్తుంది. జన్మ రాశి లగ్న తదితర అంశాలను లెక్కగట్టడానికి హస్తరేఖల గుర్తులను ప్రామాణికంగా తీసుకోవాలి! కనుకనే పూర్వ రుషులు, క్రీస్తుకు పూర్వమే కొన్ని వేల ఏళ్ల క్రిందట మూడు రకాలుగా హస్తరేఖల గుర్తుల్ని వర్గీకరించారు.

అవి : 1. శంఖువు (గుల్లగా ఉండేవి)

2. చక్రము (గుండ్రని ఆకారం)

3. బాణము (విలువంపు ఆకృతి)

**శంఖువు :** వీటి ముద్రలు వామావర్తం అనీ, దక్షిణావర్తం అనీ రెండు రకాలు. అన్ని వ్రేళ్లపైన ఉంటాయి.

**చక్రము :** వ్రేళ్ల మీదనే గుండ్రని ఆకృతిలో కనిపిస్తాయి.

**బాణము :** పై రెండిటికీ భిన్నంగా కొంత అర్ధవృత్తం, వాటి రెండు చివర్లనూ కలిపే రేఖల్లా బాణాకృతిలో ఉంటాయి.

వీటి ముద్రల విశేషాలను బట్టి రుషులు ఫలితాల్ని వర్గీకరించారు. వీటి ఆకృతులు కుడివైపు తిరిగి ఉండటాన్ని శుభ పరిణామంగా చెప్పారు.

ఉదాహరణలు కొన్ని చూద్దాం!

1. అంగుష్ఠం మీద 'యవ యోగం' (దీని గురించి తర్వాత చర్చిద్దాం!)తో కూడిన చక్రం ఉంటే, అటువంటి వ్యక్తికి తండ్రితాతల ఆస్తి బాగా కలిసొస్తుంది. దీనికి బదులుగా ఇదే స్థానంలో శంఖువు ఉంటే ఏ ఆస్తీ ఉండదు. (పిత్రార్జితం)
2. చూపుడు వ్రేలిపై చక్రం ఉంటే, మిత్రులద్వారా ఆస్తి లాభాన్ని సూచిస్తోంది. అలాగాక ఇదే గుర్తుకు బదులు ఇతర గుర్తులుంటే, మిత్రులకు తన సొమ్ము వ్యయ పడుతుంది.

3. ఉంగరపు వ్రేలు (అనామిక)పై చక్రం ఉంటే ప్రజలధనం బాగా కలిసి రావడం లేదా ప్రజా సంబంధాల వల్ల లాభపడడం జరుగుతుంది. శంఖు వుంటే ప్రజలకే ధనం ధారపోస్తారు.
4. నడిమివ్రేలుపై శంఖువు దైవపరమైన - దైవదత్తమైన ధనాదాయం సూచిస్తున్నది. కర్మకాండలు, జ్యోతిషం, గుడి గోపురాలపై పెత్తనం ద్వారా డబ్బు సంపాదిస్తారు.
5. కనిష్ఠిక (చిటికెన వ్రేలు)పై చక్రం వ్యాపారం ద్వారా రాబడిని సూచిస్తుంది. ఇదే శంఖువు వుంటే వ్యాపారంలో నష్టపోవడం జరుగుతుంది.

ఈ క్రింది పట్టిక, పూర్తిగా పై మూడు గుర్తులకు ఉండే సంబంధ బాంధవ్యాల రీత్యా ఫలితాలు తెలుపుతుంది.

| మొత్తం | శంఖువు | చక్రము | బాణము |
|---|---|---|---|
| 1 | శుభం | రాజు | మేధావి |
| 2 | వ్యాపారవేత్త | స్థితిమంతుడు | వక్త |
| 3 | మధ్యమ స్థితి | ధనయోగం | ధనవంతుడు |
| 4 | మేధావి | ధనం, కాని నిలబడదు | అందం |
| 5 | అల్ప విద్య | వ్యవహారవేత్త | నేర్పరి |
| 6 | రాజ్యలక్ష్మి గల | సామాన్య స్థితి | వేదపండితుడు |
| 7 | పలుకుబడి | పరోపకారి | సౌఖ్యశాలి |
| 8 | రాజ్యలక్ష్మి గల | రోగి | ధైర్యస్థుడు |
| 9 | రాజయోగం | రాజు | సోమరి |
| 10 | ఆచారవేత్త కానివాడు | అల్పాయుష్యుడు | బాగా స్థితి కలిగిన |

పై పట్టికలో చూసుకుని, మనకున్న పదివ్రేళ్లలోను ఎన్ని శంఖువులున్నాయో, ఎన్ని చక్రాలున్నాయో, ఎన్ని బాణాలున్నాయో లెక్కించి వాటి ఫలితాలు కనుగొనవచ్చు!

ఉదాహరణకు నాలుగవ వ్రేలు మీద శంఖం, ఐదో వ్రేలి మీద బాణం, తొమ్మిదో వ్రేలి మీద చక్రం ఉన్నాయనుకుందాం!

రాజువంటి వాడు, మేధావి, వ్యవహారవేత్త, అని ఫలితం సూచిస్తుంది. మరో పద్ధతి ప్రకారం 2 శంఖువులు వ్యాపారవేత్త అనీ; ఎనిమిది చక్రాలు రోగి అనీ, రెండు బాణాలు వక్త అనీ సూచిస్తాయి. ఏ పద్ధతిని అనుసరించినా ఫలితాలలో తేడాలుండవు.

## చక్రము :




చక్రాకారపు గీతలు కలిగి, చక్రావృతమైనటువంటి గుర్తు ఇది. త్రికోణంగానూ కన్పించవచ్చు! ఇది అంగుష్ఠములో ఊర్ధ్వభాగాన, చక్కగా కనిపించే రీతిలో ఉంటుంది. దీని గుణాలను ఇలా వివరిస్తారు.

1. అన్ని బొటనవ్రేళ్ల మీద అరుదుగా కన్పిస్తుంది.
2. శుభసూచక గుర్తు.
3. ఇతర వ్రేళ్లపై ఉన్నా, అంతర్లీనంగా శని ప్రభావం, దీని నాడులలో ఉంటుంది. (ఈ నాడులు చర్మం క్రింద నుంచి మెదడుతో సంబంధం కలిగి ఉంటాయి.)
4. ఈ గుర్తు గొప్ప మేధావిత్వాన్ని సూచిస్తుంది. అంతే కాదు! ఆశావహదృక్పథం, ధైర్య సాహసాలకు మారుపేరైన వ్యక్తులవుతారు.
5. చంద్ర స్థానంలో ఈ గుర్తు గలవారు మూడీగా ఉంటారు. పౌర్ణమి రాత్రులలో భావావేశాలకు లోనవుతారు.
6. చాలా కొద్దిమందికి ఈ చక్రస్థానం వ్రేళ్ల మీదగాక అరచేతుల్లో ఉంటే, చక్రం తిప్పగల వ్యవహారవేత్తలు, రాజరికం చలాయించే వారుగా ఉంటారు. భరతవర్షం అని పేరొందిన ఈ భారతదేశాన్ని పరిపాలించిన భరతుడు (దుష్యంతుని కుమారుడు) ఇటువంటి చక్రం కలిగి వున్నట్టు మహాభారతంలో చెప్పబడింది.

చూపుడు వ్రేలుకంటే ఉంగరపు వ్రేలు పొడుగ్గా ఉండి, ఇటువంటి చక్రం కలిగి ఉంటే ఆ వ్యక్తి స్మగ్లర్ గాని, జూదగాడుగా గానీ, బ్లాక్ మార్కెట్ చేసేవాడు గాని అయి వుంటాడు. అంతేకాదు! వీరికి సూర్యరేఖ కూడా బలంగా ఉంటే ఇటువంటి వాటిలోనే పేరు ప్రఖ్యాతులూ, విజయం కూడా ఖాయం!

## అర్థచక్రం :




ఇవి కూడా చక్రాలే గాని, కాస్త వైరుధ్యాన్ని కలిగి వుంటాయి. కనుక అర్థవృత్తాలుగా పరిగణిద్దాం! జిలేబీ చుట్టల్లాంటి చక్రాలతో ఆ వృత్తమై ఉంటాయి. దీంతో చాలామంది వీటిని సంపూర్ణ చక్రాలు అనే భ్రమ పడుతుంటారు.
తేడా గమనించకపోతే ఫలితాలు తప్పుతాయి. వీటి ప్రకారం - సంపూర్ణ చక్రాలు ఇచ్చే ఫలితాలు ఏవీ ఇవి ఇవ్వవు. ఎంతో చలాకీగా ఉంటే స్వభావం గల వారైనప్పటికీ భయ సంశయగ్రస్త మనస్కులై ఉంటారు.

## శంఖువు :




త్రికోణాకృతిగల పొడుగాటి రేఖలు శంఖువు ఆకారం దాల్చవచ్చు! ఇవి సాధారణంగా అందరి చేతులలోనూ కనిపిస్తాయి. ఇవి ఉత్తమ ఫలవంతాలు కావు. వ్రేలిమీద గ్రహస్థానం బట్టి కొన్ని శుభసూచకం కావచ్చు!

ఇక్కడో విచిత్రం కూడా ఉంది. సాధారణంగా ఇవి కలిగివున్న వారిలో అధిక విద్యావంతులై ఉండి, ధన లేమి చేత బాధపడేవారున్నారు. కొందరు హృద్రోగులుండొచ్చు!

## బాణం :

శంఖువు, చక్రం గాకుండా తదితర ఆకృతుల్లో రేఖలుంటే, అవి బాణాకార రేఖలు. ఇవి కలిగిన వారు నిరాడంబరులు, పెద్ద మనసున్నవారు, ధైర్యం, తెలివీ గలవారై ఉంటారు. ఇవీ రెండు విధాలుగా ఉంటాయి.




1. చిన్న విలువంపు : ఇది శుభదాయకం. స్వార్థంలేని ప్రేమికులు, పరోపకారగుణాన్ని కలిగిన వారు. ఉన్నతస్థాయి ఇంజనీర్లు ఈ కోవలోకి వస్తారు. మంత్ర తంత్ర వేత్తలు జ్యోతిషవేత్తలుగా కొందరు పేరు పొందగలరు.




కళాత్మక రంగాల్లో తెలివైన వీరు, ఎవరినీ
ంత తేలిగ్గా నమ్మరు.

పెద్ద విలువంపు : ఇలా ఉండడం అరుదు.
ంపుగా వున్నా నిలువు గీతల్లా కనిపించే ఈ
ంలు గట్టి ఆత్మవిశ్వాసానికి చిహ్నామే అయినా, వీరిని ఇతరులు అంత తేలికగా
మ్మరాదు. వంచనగుణం అంతో ఇంతో ఉంటుంది.

రేఖల్లో ఉండే వైరుధ్యం అనంతం. కనుక కొంతమంది సంగీతం వంటి లలితకళల్లో
ష్ణాతులై ఉంటారు.

ఇది అగ్నితత్త్వ రేఖ కనుక, కొందరు డిటెక్టివ్‌లుగా రాణిస్తారు. రహస్య వృత్తులలో
ంటారు గోప్యంగా ఉండటం వీరికి ఇష్టం!

ఈ విలువంపు దీర్ఘంగానూ - చూపుడువ్రేలు పైనా ఉంటే, అట్టివారు చక్కని
రోగ్యవంతులై ఉంటారు. అంతేకాక ఆకర్షణీయమైన వర్చస్సు కలిగి, రాజకీయాలలో
ణించే వారై ఉంటారు.

## ద్విస్వభావం లేదా మిశ్రస్వభావం :

శంఖువు, చక్రము, బాణము, తదితర గుర్తులుగానీ, ఆయా ఆకృతులుగానీ మొత్తం
వ్రేళ్లపైన మిశ్రమంగా ఉంటే మిశ్రమ ఫలితాలు కలుగుతాయి.

ద్విస్వభావ రాశులైన మీన, వృశ్చిక రాశుల్లో ఈ గుర్తులు, తార్కిక చాతుర్యాన్నీ ప్రేమ
వ్యయాలను సూచిస్తాయి అనగా - ఆ రెండు రాశుల్లో జన్మించిన వారి వ్రేళ్లలో ఈ
హ్నాలుండటం వల్ల ఆ స్వభావం కలిగిన వారవుతారు.

చూపుడు వ్రేలిమీద ఈ గుర్తులున్న వారికి దైవభక్తి లోపం, నీటి సంబంధ వృత్తులు
ాగాలలో అభిరుచిని చూడవచ్చు!

నడిమి వ్రేలిమీద ఈ ద్విస్వభావ గుర్తులున్నట్లయితే ద్రవ పదార్థ కొనుగోళ్లు
మ్మకాలలో రాణిస్తారు. అనామిక, చిటికెన వ్రేళ్ల మీద శంఖువు, చక్రబాణ గుర్తులు
శ్రమంగా ఉంటే వివిధ వ్యాపారాలలో కలిసి వస్తుంది.

బొటనవ్రేలిపై ఈ గుర్తులు మిశ్రమంగా ఉంటే వివిధ రంగాల్లో నిష్ణాతులవుతారు.

ఇతరత్రా ఎన్నో సూక్ష్మాంశాలు ఉన్నప్పటికీ కనీసం రెండు రంగాల్లో విజయం
ంచగలరు.

దీనిని బట్టి శంఖువు, చక్రము, బాణము గల ఆకారాల్లో గీతలున్న ఏ వ్రేలునైనా లేదా ఇవి రెండేసి గల ఏ వ్రేలునైనా పరిశీలనగా చూసిగాని నిర్ధారించరాదు.

## 4. ద్వాదశ (12) రాశులు - వాటి స్వ స్థానాలు శాస్త్రీయ వర్గీకరణ (ముద్రలను బట్టి)

వేద రుషులు భూమిని 12 భాగాలుగా విభజించారు. దీని చలనాన్ని బట్టి ఒక్కో భాగం 30 డిగ్రీలుండే విధంగా 12 రాశులు అన్నారు. ఈ విభాగాల్లో (రాశుల్లో)కి వచ్చే విధంగా ఆకాశంలో ఉన్న 27 నక్షత్రాల్నీ 2 1/4 వంతున సర్దేశారు. భూమి చలన వేగాన్ని బట్టి - రాశి కూటమిని బట్టి గ్రహ గతులు మారుతూంటాయి. హస్త సాముద్రికం విషయానికొస్తే ఈ 12 రాశుల్నీ 10 వ్రేళ్లకూ ఈ క్రింది విధంగా అన్వయించారు

**రాశి - కాల పరిమితి**

| వరుస | రాశి | డిగ్రీలు (నుండి - వరకు) | కాలపరిమితి |
|---|---|---|---|
| 1 | మేషం | $0^0$ - $30^0$ | 1 గం - 21 ని॥ |
| 2 | వృషభం | $31^0$ - $60^0$ | 1 గం - 36 ని॥ |
| 3 | మిధునం | $61^0$ - $90^0$ | 1 గం - 59 ని॥ |
| 4 | కర్కాటకం | $91^0$ - $120^0$ | 2 గం - 19 ని॥ |
| 5 | సింహం | $121^0$ - $150^0$ | 2 గం - 34 ని॥ |
| 6 | కన్య | $151^0$ - $180^0$ | 2 గం - 21 ని॥ |
| 7 | తుల | $181^0$ - $210^0$ | 2 గం - 21 ని॥ |
| 8 | వృశ్చికం | $211^0$ - $240^0$ | 2 గం - 34 ని॥ |
| 9 | ధనుస్సు | $241^0$ - $270^0$ | 2 గం - 19 ని॥ |
| 10 | మకరం | $271^0$ - $300^0$ | 1 గం - 59 ని॥ |
| 11 | కుంభం | $301^0$ - $330^0$ | 1 గం - 36 ని॥ |
| 12 | మీనం | $331^0$ - $360^0$ | 1 గం - 21 ని॥ |

'జాతక పారిజాతం' ప్రకారం ఈ 12 రాశులు ఈ స్థలములందు అధివసిస్తాయి. (అనగా - ఇవి ఉండు తావులు అని అర్థము) వీటి స్వక్షేత్రములు అని కొందరి వ్యవహారం.

| రాశి | - | స్థానం (తావు) |
|---|---|---|
| మేషం | - | లోహాలు, వజ్రాలుండే ఉనికి పట్టులు |
| వృషభం | - | కొండశిఖరాలు, అడవులు |
| మిథునం | - | జూదశాలలు, పానశాలలు |
| కర్కాటకం | - | నూతులు, చెరువులు, సరస్సులు |
| సింహం | - | గుహలు, కీకారణ్యాలు |
| తుల | - | బజార్లు, ద్రవ్యచలామణి ప్రదేశాలు |
| కన్య | - | గడ్డి మైదానాలు, తోటలు, కళాత్మక నిలయాలు |
| వృశ్చికం | - | కీటక దాస స్థానాలు, నిల్వ గృహాలు |
| ధనుస్సు | - | విలుకాళ్లు, అశ్వికులు |
| మకరం | - | అడవుల్లోని మడుగులు, నదులు |
| కుంభం | - | కడవ ఎక్కడున్నా నీటితో ఉండేది అయ్యేలా |
| మీనం | - | నీటి మడుగులు, జలాశయాలు |

పై రాశుల ఉనికిపట్లు, ఆయా రాశుల స్వభావాన్నీ, అవి సంచరించే ప్రదేశాల్నీ ...లియజేసినట్లు గానే; ఈ భూమి మీద అవి ఏయే చోట్ల ఉంటాయో చెప్పడం వెనుక ...ంతరార్థం - మొత్తం ఈ భూగోళంలో ఉన్న చెరువులు, అడవులు, తోటలు, కొండలు, ...ులు, వివిధ వస్తువులు, వ్యక్తులు వీటికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు చెప్పడమే!

## 5 వ్రేలిముద్రలలో ప్రబలంగా దాగి ఉన్న లగ్న విశేషాలు




ఇక్కడున్న బొమ్మను నిశితంగా ...శీలిస్తే ఎక్కడ చెట్లున్నాయో, ఎక్కడ ...ర్వతాలున్నాయో, ఎక్కడ గడ్డి ...ములున్నాయో మనం గ్రహించగలం!

అంటే - సరస్సు, మైదాన ప్రాంతం ... ఒకచోట కలసి ఉన్నాయి. సహజంగా ...వాపు ప్రతి అంగుష్ఠం మీదా ఇటువంటి

శంఖువులు, చక్రములు, ధనురాకృతులు కలిసి ఉంటాయి. రాశులకూ - అంగుష్ఠముద్రలకూ ఇలాంటి సంబంధమే ఉంది.

ఇప్పుడు 5 - సి; 5 - డి, బొమ్మలలో ఇచ్చిన వ్రేలిముద్రల ఆకృతులతో పై బొమ్మను పోల్చి చూడండి! దీనివల్ల ప్రకృతితో - ప్రకృతిలోగల వనరులతో ఉన్న సంబంధాన్ని మనమే అంచనా వేసుకోవచ్చు!

## 6 రాశి తత్త్వాలను బట్టి ముద్రలకు - రాశులకు గల అంతర్గత సంబంధం

*'పృథివ్యాపస్తేజో వాయు*

*రాకాశ మితి భూతాని ॥'* (న్యాయదర్శన 1/1; సూత్ర - 13)

న్యాయ వైశేషిక దర్శిని వేదాంత సూత్రాల ప్రకారం, పంచ భూతములు.... అనగా భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం (శూన్యం) పంచేంద్రియాలకు ప్రతీకలు. అవి : వినికిడి (చెవులు), రుచి (నాలుక), స్పర్శ (చర్మం), గంధం (ముక్కు), రూపం (కన్ను). ఇవన్నీ పని చేస్తుంటేనే ప్రాణం ఉన్నదంటాం! ఇవి క్రియాశీల రహితమైతే మరణమే!

జ్యోతిశ్శాస్త్రంలో గాలి, ఆకాశం వేర్వేరు పదార్థాలనబడవు. కనుక నాలుగే పరిగణించారు. అనగా.... వీటి తత్త్వములను బట్టి - అగ్ని తత్త్వము, భూతత్త్వము, వాయుతత్త్వము, జలతత్త్వము అన్నారు. మనకున్న 12 రాశులనూ వాటికున్న స్థానాలను బట్టి ఈక్రింది విధమైన తత్త్వాలు కలిగిన వాటిగా వర్గీకరించారు.

| **తత్త్వం** | **రాశి** |
|---|---|
| అగ్ని | మేషం, సింహం, ధనుస్సు |
| భూ | వృషభం, కన్య, మకరం |
| వాయు | మిధునం, తుల, కుంభం |
| జల | కర్కాటకం, వృశ్చికం, మీనం |

మూలతత్త్వాన్ని బట్టి వీటిని మళ్ళీ స్థిర రాశులు అనీ, చర రాశులు అనీ, ద్విస్వభావ రాశులు అనీ వర్గీకరించారు. ఇవి వరుసగా ధాతు సాంఖ్యక, మూలసాంఖ్యక, జీవసాంఖ్యక అనే పేర్లతోను వ్యవహరిస్తారు.

| భాలు సాంఖ్యత స్థిర | మూల సాంఖ్యక చర | జీవ సాంఖ్యక ద్విస్వభావ |
|---|---|---|
| మేషం | వృషభం | మిధునం |
| కర్కాటకం | సింహం | కన్య |
| మకరం | వృశ్చికం | ధనుస్సు |
| తుల | కుంభం | మీనం |

## మూల తత్త్వ వర్గీకరణ

జన్మలగ్నాన్ని బట్టి, ఒక బొటనవ్రేలి మీద ఏర్పు ఈ రాశిని తెలియజేస్తుందని' అర్థం కొనే విధం ఇది :



తత్వ రాశుల గుర్తులు : మేష, సింహ, • రాశులకు అగ్ని జ్వాలల వంటి లుండటం గమనార్హం. (బొమ్మలో చూపబడిన విధంగా)

ఈ గుర్తులు శంఖువు ఆకారాన్ని స్ఫురింపజేస్తున్నాయి. అగ్నితత్త్వ రాశులకు చెందిన సలు పొడవాటి అరచేతిని కల్గి ఉన్నప్పటికీ, పొట్టివ్రేళ్లు కలిగి ఉంటారు.

ం : సాధారణంగా ఈ జాతకులు తెలివైనవారు, నిర్ణాయక శక్తిని కలిగి ఉన్నవారు అయి ారు. వీరిది ఆచరించి చూపించే గుణం. అదే వీరి బలం. నిర్లక్ష్యం, ధైర్యం వీరి సొత్తు. చక్కని క్రమశిక్షణ పరులు. ఆకర్షణీయమైన, ఛాలెంజ్ తత్త్వం కలిగినవారు. అన్యాయాన్ని ంచరు. తిరగబడే ధోరణి కూడా సూచితం.

## వాయుతత్త్వ రాశుల గుర్తులు :

మిధునం, తుల, కుంభం రాశులకు - లోపల ఖాళీ జాగా లేక గుల్లగా ఉండే ఖండడం (బొమ్మ చూడండి) గమనించండి!



మధ్యభాగం బోలుగా ఉండడంతో, గాలిప్రవేశించడానికి మార్గం సుగమంగా ఉన్నట్టు భావించాలి. దీంతో ఇవి బెలూన్ల మాదిరి కన్పిస్తాయి. సాధారణంగా ఈ వాయుతత్త్వ జాతకులు చతురస్రాకారపు అరచేతిని కలిగి ఉండి పొడవాటి వ్రేళ్లు కలిగి ఉంటారు.

**ఫలితం :** ఈ రాశుల జాతకులు మానసిక వికాసాన్ని - మనోబలాన్ని కలిగి ఉంటారు. త్వరగా ప్రతిస్పందిస్తారు. జాగ్రత్తపరులు. సత్యాన్ని అన్వేషించే వారుగా ఉంటారు.

గాలికి చలనం ఎంత సహజమో, ఈ తత్త్వ రాశిగల జాతకులకు కూడా నిలకడ అంతగా ఉండదు ఇటువంటి లోపంవల్ల వీరికి ఒంటరిగా విజయం సాధించడం సాధ్యం కాదు.

## భూతత్త్వ రాశుల గుర్తులు :

వృషభ, కన్య, మకర రాశులకు శిఖరాల, లోయల గట్ల ఆకృతిలో గుర్తులను వ్రేళ్ల మీద చూడగలం! ఒక నది లేదా ప్రవాహం కొండ శిఖరం జారిపడే రీతిలో గుర్తును ఏ బొటనవ్రేలి మీదనైనా మనం గమనించగలిగితే, అట్టి జాతకులు ఈ మూడు రాశులలో ఒకదానికి చెందినవారై ఉంటారు.

**ఫలితం :** ఈ తత్త్వ జాతకులు నిజాయితీపరులు, నమ్మదగ్గవారు. ప్రేమలో, కష్టించి పనిచేయడంలో వీరికి వీరే సాటి. కొందరు సాధు సత్పురుషులవుతారు. దైవభక్తి చింతనలో కొందరు శేషజీవితం గడపగలరు.

## జలతత్త్వ రాశుల గుర్తులు

కర్కాటకం, మీనం, వృశ్చికం ఈ వర్గంలోకి వస్తాయి. చిన్న చిన్న తరంగాలుగా, బుడగల్లా ఉండే రేఖాకృతులను బొటన వ్రేలిమీద గమనించవచ్చు!

మంచినీటి సరస్సుల్లో ఉండే జలరాశుల ఆకృతులు; నీటిలో రాయివేస్తే అలల వంటి ఆకృతులు ఈ రాశి కోవలో చూడగలం!



వెడల్పాటి హస్తం కలిగి సూచ్యాకారపు వ్రేళ్లు కలిగి ఉండే జాతకులు వీరు.

తం : వీరు చాలా సెన్సిటివ్‌గా ఉంటారు. ఆశాపరులు, మనోశక్తితో పాటు ఎదిగే వాదులు. తక్షణ నిర్ణయాలు చెయ్యగలిగే వారుగా ఉంటారు.

కాని, వీరిలో కొందరు ఆత్మ న్యూనతాభావుకులు, కొందరు ఈర్ష్యాపరులు అవుతారు.

ఆకృతులలో తేడాను బట్టి జలతత్త్వ రాశులకి చెందిన ఈ జాతకులను కళాకారుల లో చేర్చవచ్చు!

కొందరు చిత్రకారులు, సంగీతవేత్తలు, కవులు, (నాయకులు సైతం) ఈ మూడు లలో కన్పిస్తారు.

ఇంకొక అంశం! వీరిలో గుణాలను జనాంతికంగా చెప్పడం తప్ప, విడివిడిగా ిడించడం కుదరదు.

## 7 రాశుల సిద్ధాంత వర్గీకరణ - వాటి స్వభావం

***ధాతు ................ తద్దైవ***

***స్వర్ణ ................ సజీవః ॥*** (జాతక పారిజాతం 1/19)

మకర, మేష, కర్కాటక, తులా రాశులు - లోహ సంబంధి.

వృశ్చిక, వృషభ, సింహ, కుంభ రాశులు - మూల సంబంధి.

మిధున, కన్య, ధనుర్మీన రాశులు - శాక సంబంధి.

బంగారం మొదలైన లోహాలు; వృక్షాలు - వాటి కాండాలు;

వృక్షాలు మూలాలు - (చెట్ల వేర్లు) ఈ వర్గీకరణలో ఉపకరిస్తున్నాయి.

హోరారత్న ప్రకారం - లోహ సంబంధి చరరాశులు. త్వరితంగా చరిస్తాయి. ఈ రాశుల కులు త్వరగా కృషి చేస్తారు.



మూల సంఖ్యాక (సంబంధి) రాశులు స్థిర రాశులు. వీరు సాధారణంగా స్థిరంగా ఉద్యోగం చేసే జాతకులై ఉంటారు.

ద్విస్వభావ రాశులన్నీ శాక సంబంధి. స్థిర, చర చిత్తంగల జాతకులై ఉంటారు.

కొడవలి ఆకృతి రేఖ గలవారు లోహసంబంధి జాతకులు.



భూమిలోపలికి చొచ్చుకు పోగల వ్రేళ్లున్న రీతిలో మూల సంబంధి జాతకుల రేఖలు వుంటాయి. కొందరిలో ఇవి నెమలి ఫించం ఆకృతిలోనూ ఉండొచ్చు!



ఈ రెండు ఆకృతులనూ కలిపిగాని; విడివిడిగా దగ్గర్లోగాని వుండేవి శాక సంబంధి. ఆకుల్లా, కీటకాల్లా చేపల్లా ఉండే ఆకృతులు.

## 8 రాశుల వర్గీకరణ రాశులతో నాడీ సంబంధాలు

రాశికీ, దాని గుర్తుతో బొటనవ్రేలి ముద్రకూ గల సంబంధాలను ఇప్పుడు పరిశీలిద్దాం! ఇవి జాతకునికి ఎలాటి ఫలితాలు సూచిస్తాయో కూడా చెప్పబడింది.

: అర్ధవృత్తాకార జ్వాలాకృతి మంటలు ప్రతిబింబిస్తాయి. అగ్ని తత్త్వరాశి, తమోగుణం, ్థానం, చరరాశి. రాశ్యాధిపతి - కుజుడు. ప్రభావం చూపు స్థానం - నుదురు.



12 రాశులలోనూ ఇదే ప్రధానంగా చరరాశి. ఆందోళనకు ప్రతీక. రేసు గుర్రంలా కొత్త ;నలకు శక్తిని సమకూర్చగల స్వభావం గలది. ఈ రాశి జాతకులు ధైర్య స్వభావులు. ా తమ స్వభావానికి విరుద్ధంగా పనులు చేపట్టరు. తీవ్ర స్వభావం వల్ల జీవితంలో ండుకులు ఎదుర్కొంటూ ఉంటారు. వీరిలో లీడర్లు, డిటెక్టివ్‌లు, ఇన్‌స్పెక్టర్లు, ళ్లు, ఫోటోగ్రాఫర్లు ఇంకా ఇటువంటి చొరవగల వృత్తులవారు చేరతారు.

ం : కొండలు, ప్రవహించే నదులు, చెట్ల వేర్లు, నెమలి ఈకలు, మైదాన భూములు ంబించే గుర్తులు. భూతత్త్వ రాశి - తమోగుణ ప్రధానం. కొండ శిఖరం స్వస్థానం. ధిపతి - శుక్రుడు. ప్రభావం చూపు దేహభాగం - నోరు.



ొద్దుమూపురం ఆకృతిగల రేఖలు లేదా నది వంపు తిరుగుతున్నట్లుండే రేఖలకు స్వతంత్ర జీవి. ఆరోగ్యవంతుడు అయిన జాతకుడు

**మిధునం :** ప్రతిబింబించే గుర్తులు; గాలులు, తుఫాన్లు మొ॥నవి. వాయుతత్త్వ రాశి. సత్త్వ గుణ ప్రధానం. లైంగిక కార్యక్రమాలు, ప్రేమ విహారాలు స్వస్థానాలు. ద్విస్వభావ రాశి - రాశ్యాధిపతి - బుధుడు. ప్రభావితం చేసే శరీరావయవం - వక్షం.



వాయువుతో నింపబడిన తిత్తి వంటి ఆకృతిగల చిహ్నాలను అంగుష్ఠం సూచిస్తుంది. సూక్ష్మదర్శినితో శోధిస్తే చిరు చేపలు, కీటకాలు, సర్పాలు కనిపించే రూపాలు.

అభిరుచిని, మనస్సుని, సంతోషాన్ని ప్రభావితం చేసే ఈ రాశి జాతకులకు ఇతరులతో సత్సంబంధాలుంటాయి వక్రత చేత అబద్ధాలాడే గుణం, వ్యాపారదక్షత కొందరిలో చూడొచ్చు! వీరికి సంతానం తక్కువ. వక్తలు, ఉపాధ్యాయులు, ఎడిటర్లు, డాక్టర్లు, సైకాలజిస్టులు ఈ రాశి కోవలోకి వస్తారు.

**కర్కాటకం :** జలతత్త్వ రాశి. తమోగుణ ప్రధానం. చెరువులు, బావులు, సరస్సులు స్వస్థానాలు. చరరాశి, రాశ్యాధిపతి - చంద్ర. ప్రభావితమయ్యే అవయవం - గుండె.



ఈ రాశి నీటిలో సుడులు తిరిగే వృత్తాకారంలో అంగుష్ఠంపైన కనిపిస్తుంది. చరరాశి కనుక నీటిలో తరంగ చలనం స్ఫురింపచేస్తుంది. (బొమ్మ చూడండి!)

కాలచక్ర రీత్యా ఇది 4వరాశి. ఈ రాశి జాతకులు స్వాభిమాన పరులు. గొప్ప జాగరూకతతో వ్యవహరించేవారు అయి ఉంటారు. కళాకారులు, రచయితలు వీరిలో ఉంటారు.

**సింహం :** అగ్నితత్త్వ రాశి. రజోగుణ ప్రధానం. దట్టమైన అరణ్యం స్వక్షేత్రం. స్థిరరాశి. రాశ్యాధిపతి రవి. ప్రభావితమయ్యే శరీరావయవం - ఉదరం.



బలానికి ప్రతీక అయిన సింహరాశి వ్యక్తులు ధైర్యస్థులు, విశాల హృదయులు, సిద్ధాంతాలకు కట్టుబడి ఉండేవారు అయి ఉంటారు.

ఈ రాశి జాతకులలో పోలీసు ఆఫీసర్లు డిటెక్టివ్‌లు, శారీరకంగా కష్టించి పనిచేసేవారు అధికం. లాయర్లు, కంట్రాక్టర్లు కూడా ఉండొచ్చు!

**కన్య :** భూతత్త్వరాశి. సత్వగుణ ప్రధానం. ఆకుపచ్చని వనాలు స్వస్థానం. ద్విస్వభావ రాశి. రాశ్యాధిపతి - బుధుడు. ప్రభావితం చేసే అవయవం - నుదుం. పర్వతాలు, నదుల్లో ప్రాణులు ప్రతిబింబించే గుర్తులు.



ఈ రాశి కొండ ఆకృతి చుట్టూ నది వంపు తిరిగి పారుతున్నట్లు కనిపిస్తుంది. ఆరోగ్యం, విజ్ఞాన శాస్త్రాలను ప్రభావితం చేసే రాశి.

ఈ రాశి జాతకులకు అన్నిటా విజయమే వీరిలో రుషులు, ఉపాధ్యాయులు, ఏజంట్లు అయి ఉంటారు.

**తుల :** గాలితో నిండి ఎగిరే గుడారంలాంటి ఆకృతి. వాయుతత్త్వ రాశి. తమోగుణ ప్రధానం. స్వస్థలం వ్యాపార కేంద్రం. చరరాశి. రాశ్యాధిపతి - శుక్రుడు ప్రభావితం అయ్యే అవయవం - కటి ప్రదేశం.



ఆలోచనలకూ - ఆచరణకు సమతాస్థితిని సాధించే ఈ రాశి జాతకులు గొప్ప తెలివైన వారయి ఉంటారు. చైతన్యవంతమైన ఆలోచనలతో సాగుతారు. వీరిలో మనకు రాజకీయవేత్తలు, ఎడిటర్లు, దర్శకులు, నటులు, జడ్జీలు కనిపిస్తారు.

**వృశ్చికం : ప్రతిబింబించే గుర్తులు :**

నీటిలో సుడిగుండాలు, నెమలి ఈకలు, తేలుకొండి.

జలతత్త్వ రాశి. రజోగుణ ప్రధానం. చెట్లు కీటకాల రంధ్రాలు స్వక్షేత్రాలు స్థిరరాశి. రాశ్యాధిపతి - కుజుడు. ప్రభావితం చేసే అవయవం - శిశ్నం.



ఈ రాశి జాతకులు, జీవితంలోని ప్రధమ అర్ధభాగం ఆనందంగా గడపగలరు. అసూయాపరులు.

చాలా చురుకుగా ఉంటారు. వీరికి పులుపు చాలా ఇష్టం.

విమర్శకులు, రచయితలు, గణకులు, ఇంజనీర్లు, పోలీస్ అధికారులు వీరిలో కనిపిస్తారు.

**ధనుస్సు : ప్రతిబింబించే గుర్తులు :** చుట్టలు చుట్టుకునే జ్వాలలు. అగ్నితత్త్వ రాశి. సత్వగుణ ప్రధానం. స్వక్షేత్రం - గుర్రాలు, విలుకాళ్లు. ద్విస్వభావ రాశి. గురుడు రాశ్యాధిపతి. ప్రభావిత శరీరాంగం - పిరుదు.



మేధో పరమైన అంశాల్లో చురుగ్గా ఉండే ఈ రాశి జాతకులు సత్యం కోసం ప్రాకులాడే రకం. ఆశావహమైన జీవితాన్ని అన్వేషిస్తారు.

జాకీలు, విలుకాళ్లు, క్రీడాకారులు, బోధకులు, సైనికులు, నావికులు ఈ రాశిలో ఉంటారు.

**మకరం :**

**ప్రతిబింబించే గుర్తులు :** విచ్చుకోబోయే మొగ్గని పోలిన ఆకృతి. భూతత్త్వరాశి. తమోగుణ ప్రధానమైనది. నీరు లేదా భూమి స్వక్షేత్రం. చరరాశి. ప్రభావితమయ్యే అవయవం - చీలమండలు.



మొసలి పట్టుదలకు ప్రతీకలనదగ్గ ఈ రాశి జాతకులు దురాశాపరులు. కొందరు పోట్లాడే స్వభావం గలవారు. ఏవో ఆలోచనలు చేస్తూనే ఉండే, వీరికి ఇతరుల మీద పట్టు సాధించే గుణం అధికం. ధనం వీరివద్ద అంతగా నిలబడదు.

రాత పనులు, వేదాంతం, సాంఘిక శాఖలలో ఈ రాశి వారు బాగా రాణిస్తారు.

**కుంభం :**

వాయుతత్త్వ రాశి. భూములు స్వస్థానాలు. సత్వగుణ ప్రధానం. స్థిరరాశి. రాశ్యాధిపతి - శని. ప్రభావితం చేసే శరీరభాగాలు - కాళ్లు.

ప్రతిబింబించే గుర్తులు - వృక్షమూలాలు, పక్షి ఈకలు.



ఒక బెలూన్‌లోనో, తిత్తిలోనో బాగా గాలి నింపి పైకి వదిలితే ఏ ఆకృతిలో ఎగురుతుందో ఆ రీతిలో ఉండే రాశి.

ఇది తెలివికీ, దీర్ఘ ఆలోచనకూ ప్రతీక. రహస్య సమాలోచనలు, ధ్యానం, స్థిరాభిప్రాయాలు వీరి సొత్తు. ఈ రాశి జాతకులు కళాకారులు.

**మీనం :**

**ప్రతిబింబించే గుర్తులు :** సరస్సులు, చేపలు, జలతత్త్వ రాశి. సత్వగుణ ప్రధానం. ద్విస్వభావ రాశి. రాశ్యాధిపతి - గురుడు, ప్రభావితం చేసే శరీరావయవం - పాదం.

రెండు చేపల గుర్తు గల ఈ రాశి జాతకులలో అందం, తెలివి ఉన్నవారు అధికం. పొడగరులు.



దైవ సంబంధ విజ్ఞానం, దైవ చింతనాసక్తి ఈ రాశిలో అధికం. దయామయులు జాలిగుణం గలవారు అయి ఉంటారు.

ఈ రాశిలో దైవభక్తులు, జ్యోతిశ్శాస్త్రవేత్తలు, సంఘ సంస్కర్తలు, ఎగుమతి దిగుమతి వ్యాపారులు, మతబోధకులు, ఉపాధ్యాయులు అధిక శాతం.

## 9 అంగుష్ఠనాడీ ప్రాబల్య నిరూపణ



ఈ చిత్రాన్ని జాగ్రత్తగా పరిశీలించి, ఇదే పుస్తకంలోని 6వ నెంబరు బొమ్మతో పోల్చి చూడండి.

పై బొమ్మలో డెల్టా ప్రాంతం దిగువన ఉన్న సరస్సు మాదిరి ఆకృతి కనిపిస్తుంది. దీనిలో 3 రేఖలు ఎంతో స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఇవి వ్రేలిమీద లగ్నాన్ని, దాని డిగ్రీలను సూచిస్తున్నాయి. ఒక రేఖ 2 1/2 డిగ్రీలు సూచిస్తూ, మూడు పొరలుగా.... అనగా 3 × 2 1/2 = 7 1/2 డిగ్రీలు జననకాలం గణనకు ఉపకరిస్తున్నది. గురుగ్రహం ఇదే రీతిలో ఇతరగ్రహాలైన శనికి, రవి, చంద్రులకు వేర్వేరు డిగ్రీలు ఉన్నాయి.

లగ్నాన్ని పరిగణించేటపుడు, పై మూడు పొరలు నిముషాలు, సెకన్లకు సూచికలు. 2 1/2 డిగ్రీలు అనగా 10 ని॥లు. వివిధ లగ్నాల్ని కట్టేటపుడు ఈ పొరల మధ్య వ్యవధి ఒక పట్టికలో మున్ముందు ఇవ్వడం జరిగింది. (4వ అధ్యాయం చూడండి!)

ఈ రాశి దైవచింతన, ధార్మిక కార్యాసక్తిని, విజ్ఞానాన్ని ప్రభావితం చేస్తుంది. ఈ జాతకులకు దైవ సహాయం లభించగలదు. సంఘ సంస్కర్తలు, కవులు, గాయకులు ఈ రాశి జాతకులై ఉంటారు.

# 10 అంగుష్ఠనాడి నుండి జన్మలగ్నం కట్టుట

జాతక పరిగణనలో ప్రధానంగా చూడవలసినది - జనన కాలం.

బొటనవ్రేలి ముద్రనుబట్టి జన్మలగ్నాన్ని నిర్ధారించ వచ్చునంటే కించిత్ ఆశ్చర్యంగానే ఉంటుంది. కాని ఇది వాస్తవం. గురు, శని, రవి గ్రహ సంచారాన్ని బట్టి జననమాసం (సాయన సూర్య సంచారాన్ని బట్టి - ఏ నెలలో జన్మించినదీ తెలియడం ముఖ్యం! ఆ నెలలో ఏ తేదీన జన్మించినా, ఈ సాముదాయిక ఫలితాలు వర్తిస్తాయి.) కనుగొనచ్చు! అయితే ఈ ఫలితాలు బాగా రావాలంటే, కేవలం అంగుష్ఠనాడిని బట్టి జనన తేదీ, మాసం, సంవత్సరం కూడా తెలియాలి! బాగా శ్రమ చేస్తే తేదీ సంవత్సరం కూడా తెలుసుకోవడం అసాధ్యమేమీ కాదు.

ఉదాహరణకు - జనన తేదీ సరిగ్గా తెలియని వ్యక్తులకు పంచాంగాలు తిరగేసి, జననకాలం నిర్ణయించడాన్ని మనం గమనించాం కదా! ఇదీ ఆ రకానికి చెందిందే! రాశి, దాని దిశలో డిగ్రీల్ని (చలనాన్ని) సరిగ్గా లెక్కగడితే ఇది సాధ్యమే!

**ఇదొక ఉదాహరణ :**

మొదట ఏ జాతకుని జన్మలగ్నాన్ని కట్టాడానికి సిద్ధపడుతున్నామో, అతడి సుమారు వయస్సు తెలియాల్సి ఉంటుంది. గురు, శని గ్రహాలకు ఆధిపత్యం వహించే వ్రేలిముద్రలు తీసుకోవాలి. ఉదాహరణకు ఒక 32 సం॥ వ్యక్తికి జన్మలగ్నం కట్టాలనుకుందాం!

ఒక వ్యక్తి విజయవాడలో ఉన్నా, అతడు జోధ్‌పూర్‌లో జన్మించాడనుకుందాం! పట్టిక ప్రకారం ఇది 26/20 అక్షాంశాల మీద 73/04 రేఖాంశాల మీద ఉన్న ప్రదేశం.

లగ్నం కట్టిన సంవత్సరం 1981. అతని సుమారు వయసు 32. 1981 - 32 = 1949. అతని జనన సంవత్సరం.

1949 పంచాంగంలో - మకరంలో గురుడు, ధనుస్సులో శని సింహ సంచారం స్థితి ననుసరించి

మొదటి వ్రేలి మీద రేఖలను లెక్కగట్టి.... (ఇవి 12 ఉన్నాయనుకుందాం!) శని 6 డిగ్రీల రేఖ 6 × 2 1/2 = 15 డిగ్రీలు.

5 డిగ్రీల సింహరేఖ (రవిలో)

5 × 1 1/2 = 12.30 డిగ్రీలు

బొటనవ్రేలి మీద సింహరాశి 2 × 2 1/2 = 5 డిగ్రీలు.

పై గ్రహస్థితి ననుసరించి - అతడి జననకాలం 30-8-1949గా గుర్తించగలం! (5 డిగ్రీల సింహరాశి లగ్నం)

అప్పుడతని జన్మపట్టిక ఇలా ఉంటుంది :

| | | | | | |
|---|---|---|---|---|---|
| లగ్నం | 6 | 8 | 10 | 12 | 4 |
| శని | శుక్ర | చంద్ర | గురు | రాహు | కుజ |
| రవి | కేతు | | | | |
| | బుధ | | | | |

సూర్య (రవి) = 4/13

1వ ఇంట = 58/30

లగ్నం = 4/5

## 11. మరికొన్ని ఇతర పద్ధతులు - సిద్ధాంతాలు

క్రీస్తుశక సంవత్సరం, జనన తేదీ కట్టడం కొంచెం శ్రమతో కూడుకున్న పనే! దీని మీద కొంత పరిశోధన - పరిశీలన కూడా అవసరం పడతాయి. జ్యోతిషంతో సంబంధం ఉన్నవారూ - నిష్ణాతులకూ తప్ప మామూలు వ్యక్తులకు సాధ్యపడదు.

శనిగ్రహ నాడిగల మధ్య వ్రేలిమీద ఉబ్బు స్థానంలో గల రేఖలను లెక్కించాలి. ఇవి కూడా స్ఫుటంగా గల వాటినే పరిగణించాలి.

తరువాత గురు, కుజ రేఖలను లెక్కించాలి.

2 1/2తో శనినాడులు గుణించాలి. గురునాడులను 1 1/2 పెట్టి గుణకారం చేయాలి. వీటి లబ్ధాలకు కుజ రేఖలను లెక్కిస్తే వచ్చే సంఖ్య కలపాలి. అది అతడి ప్రస్తుత వయస్సు అవుతుంది.

క్రీస్తుశకం ప్రకారం అతడి వయసు 57 అనుకుంటే - ప్రస్తుతం నడుస్తున్న సంవత్సరంలోంచి ఈ సంఖ్య (ఉదాహరణకు - 2002 - 57 = 1945) తీసేస్తే వచ్చే సంఖ్య అతడి జనన సంవత్సరంగా నమోదు చేయాలి.

సూత్రం = శనినాడి × 5/2 + గురునాడి × 3/2 + కుజరేఖలు

(1) ప్రస్తుత సంవత్సరం - ప్రస్తుత వయసు = జనన సంవత్సరం

(2) సంవత్సరం + 57 = ప్రస్తుత వత్సరం

వయసును లెక్కించేటపుడు, క్రీస్తు సంవత్సరానికి - శాలి వాహన శకానికి గల పోలికలు - పొంతన గుర్తించడానికి అనువైన పట్టికలు, ముందే రూపొందించబడి ఉన్నాయి.

## 12. సూర్యరేఖ నుండి జనన మాసం - కనుగొను పద్ధతి

సూర్యరేఖ ప్రాధాన్యత, అంగుష్ఠనాడీ జ్యోతిషంలో అనన్యసామాన్యమైనది. ఇది అదృష్టరేఖగా - విజయరేఖగా, విజ్ఞానరేఖగానూ భాసిస్తుంది. అయితే అన్ని రేఖలూ సూర్యరేఖలు కానేరవు.

ఉదాహరణకు నదులు సముద్రంలో కలుస్తాయి. అంతమాత్రాన అవన్నీ సముద్రాలు అనలేం కదా! ఉంగరపు వ్రేలు ప్రారంభంలో మొదలై అరచేతి మధ్యవరకు వ్యాపించే ఈ రేఖ దాదాపు 90 శాతం జాతకులలో కన్పిస్తుంది.

సూర్యరేఖ 'ఉత్తరాయణం'లో శక్తివంతంగా ఉంటుంది. పురుషుల్లో బాగా బలంగా - స్త్రీలలో బలహీనంగా ఉండవచ్చు! వివిధ దిశల్లో ఈ రేఖ ఇచ్చే ఫలితాలు ఇవి :

1. అన్నీ శుభ ఫలితాలు -మేలు చేకూర్చేవి.
2. మూడవ, ఆరవ, పదకొండో ఇంట 3వంతులు శుభం.
3. స్వక్షేత్రంలో అర్థ శుభుడు.
4. మిత్రరాశిలో 1/4వ వంతు శుభుడు.
5. ఇతర రాశుల్లో 1/8వ వంతు శుభ ఫలితాలు ఇస్తుంది.

పేరు, గౌరవం, ధనం, విద్య వంటివి ఈ రేఖ ప్రభావితం చేసి, శుభ ఫలితాలు ఇవ్వడంలో గమనార్హం!

## జన్మరాశిలో-జనన మాసంలో సూర్యరేఖ నిర్ణయం :




**మేషం :** అదృష్టరేఖ పైకి సూర్యరేఖ ఒక శీర్షిక వలె ఉన్నచో అట్టి జాతకులు ఏప్రిల్ 14 -మే 14 మధ్య (వైశాఖంలో) జన్మించిన వారై ఉంటారు. (పటం చూడండి!)

మేషం పురుష మిత్ర సూర్యరాశి. ధైర్యస్తులు, ధనవంతులు అయి ఉంటారు. సూర్యరేఖ ప్రకారం స్త్రీ రాశి



**వృషభం :** ఈ జాతకులు మే 15 - జూన్ 14 మధ్య (జ్యేష్ఠ మాసంలో) జన్మించిన వారై ఉంటారు.

వీరు తెలివైనవారు, వ్యాపారవేత్తలు అయి ఉంటారు.




**మిధునం :** సూర్యరేఖ ప్రకారం పురుష రాశి. జూన్ 15 - జులై 16 మధ్య (ఆషాఢ మాసంలో) ఈ జాతకులు జన్మించిన వారై ఉంటారు.




వీరు వ్యవసాయంలో రాణించేవారు, నటులు, స్త్రీ సంతానవంతులు, సంపద గలవారు అయి ఉంటారు.

**కర్కాటకం :** సూర్యరేఖ ప్రకారం స్త్రీ రాశి. సూర్యుడు (రవి)కి మిత్రరాశి. జులై 17 - ఆగష్టు 16 మధ్య (శ్రావణమాసం)లో జన్మించిన వారై ఉంటారు.

కర్మకాండలు చేయించగలవారు; ఆయుర్వేదంలో దిట్టలు, బాగా ధనికులు అయి ఉంటారు. పుత్రసంతానవంతులు, తెల్లని కన్నులు గలవారు, తెలివైనవారు ఈ రాశిలో అధికం.




**సింహం :** ఇది రవికి స్వస్థానం గల రాశి సూర్యరేఖ రెండు సమాంతర రేఖలుగా సాగి చివర్లో కొమ్మవలె విడిపోవడాన్ని గమనించవచ్చు! ఆగస్టు 17 - సెప్టెంబరు 16ల మధ్య (భాద్రపద మాసంలో) జన్మించిన వారు ఈ రాశిలోకి వస్తారు.

చక్కని దృష్టి, తెలివితేటలు, సంపద, పిల్లలు అన్నీ వీరికి ఎక్కువే. ఎర్రటి కన్నులు ఈ రాశి జాతకుల సొత్తు.

కన్య : ఇది బుధునికి స్వక్షేత్రం. సెప్టెంబరు 17 - అక్టోబరు 16 మధ్య జన్మించిన వారు ఈ రాశి క్రిందకు వస్తారు. (ఆశ్వీయుజ మాసం) స్త్రీ రాశి.



తుల : సూర్యుడు ఈ రాశిలో ప్రవేశించే సరికి చాలా చల్లబడి ఉంటాడు. నెమ్మదిగా చలిస్తాడు. అక్టోబర్ 18 - నవంబర్ 16 మధ్య జన్మించిన వారు (కార్తీక మాసంలో) ఈ రాశిలో ఉంటారు. పురుషరాశి.

ఈ రాశి జాతకులు కొద్దిపాటి వంచన, మాటకారి తనం కలిగి వుంటారు. బాగా ధనవంతులైనా అయి ఉంటారు. నిరుపేదలై ఉండి ధనం సంపాదించే వారైనా ఉండొచ్చు



వృశ్చికం : సూర్యరేఖ కొద్దిగా వంపు తిరిగి కన్పిస్తుంది. (కుజునివైపు) - నవంబర్ 16 - డిసెంబర్ 15 మధ్య (పుష్యమాసంలో) జన్మించిన వారై ఉంటారు. పురుషరాశి.

రవికి మిత్రరాశి ఈ రాశి జాతకులు అసూయాపరులుగాను, చురుకుగాను కూడా ఉంటారు. చాలామందికి రహస్య విజ్ఞానం పట్ల ఆసక్తి అధికం. గూఢచారులు, పోలీసువారు ఈ రాశిలో బాగా రాణించగలరు. కొందరు బాగా ప్రయాణాలు చేస్తారు.

ధనుస్సు : గురుని స్వస్థానానికి సూచించే కొమ్మ వంటి రేఖగా చీలి ఉండే ఈ జాతకులు డిసెంబర్ 17 - జనవరి 13 మధ్య జన్మించిన వారు.

చురుకైన దృష్టి, పచ్చని కన్నులు, అపారమైన సంపద గలవారవుతారు. కొందరు వ్యసనపరులవుతారు.



మకరం : శనిస్థానానికి సూర్యరేఖ V ఆకారంలో చొచ్చుకొని పోయే ఈ రాశి జాతకులు జనవరి 14 - ఫిబ్రవరి 12ల మధ్య (మాఘమాసంలో) జన్మించిన వారై ఉంటారు.

వీరికి నల్లని కన్నులు అలంకారం. వీరిలో కొంతమంది లాయర్లు, చిల్లర వర్తకులు ఉండే అవకాశం ఉంది. తెలివిని స్వార్థానికి వాడుకోగలరు.



కుంభం : శనికి స్వక్షేత్రం అనదగ్గరాశి. ఫిబ్రవరి 13 - మార్చి 14 మధ్య (ఫాల్గుణ) జన్మించిన వారు ఈ రాశిలో చేరతారు.

ఈ రాశి జాతకులు సంపద, భోగాలు, వస్తు వాహనాలు అన్నీ సమకూర్చుకోగలుగుతారు. కాని చాలాకాలం జీవితంలో ఒడుదుడుకులు ఎదుర్కొంటూ ఉంటారు. పిల్లల వల్ల సుఖపడతారు. దాంపత్యకలహాలు తరచు సంభవిస్తుంటాయి.



మీనం : మార్చి 5 - ఏప్రిల్ 13ల మధ్య (చైత్రంలో) జన్మించిన వారై ఉంటారు.

దైవభక్తిపరులు, పెద్దలపట్ల వినయవిధేయతలు గలవారై ఉంటారు. పచ్చనిరంగు (ఛాయ) గలిగినవారు.

సాయన సూర్య సిద్ధాంతాన్నిబట్టి జననకాల నిర్ణయానికి -

మొదటివ్రేలి రేఖలు1మరియు2×23 / 12

మరొక సూత్రం :

మధ్యవ్రేలి రెండు తలములు

నాల్గవవ్రేలి రెండు-మూడుతలములు / 12 + 100

పై రెండు సూత్రాలు విదేశీ పండితులు అనుసరిస్తున్నారు.

## 13. జన్మ నిర్ణయం, ప్రాబల్యం, సమయం, తిథి

### అంగుష్ఠనాడిని బట్టి నిర్ణయించడం

దాదాపు 2500ఏళ్ల క్రిందట హిందూ, బౌద్ధ సిద్ధాంత గ్రంథాల్లో ఒక సూత్రం ఆపాదించబడింది.

అర్క, శుక్రో, బుధశ్చ శనిర్మంత్రీ - మహిసుత్త

ఇదే సూత్రం అంగుష్ఠనాడికి ఉపయోగించి జన్మతిథి నిర్ణయించవచ్చు!

చూపుడువ్రేలికున్న పైవరుస గీతలు, అంగుష్ఠం మీద ఉన్న గీతలు (రెండు చేతులవీ కూడా) లెక్కించి 611 కలపాలి. దీనిని 5చేత గుణించాలి. వచ్చే లబ్ధమే ఆ జాతకుని జనన తేదీ అవుతుంది.

లబ్ధం 1 అయితే ఆదివారం. ఇదే వరుసలో - 2 సోమ 3 మంగళ 4 బుధ 5 గురు 6 శుక్ర. 0 అయితే శనివారం అని గుర్తించాల్సి ఉంటుంది.

పశ్చిమదేశాల్లో ఇతర విధానాలు ఎన్నో ఉన్నా, తూర్పు దేశాల్లో ఇదే పద్ధతి అవలంబిస్తారు.

కుడిచేతి అరచెయ్యి వెడల్పు కొలిచి, ఈ లబ్ధానికి ఇందులో 1/4వ వంతు కలపాలి. ఇదే విధంగా హృదయ రేఖ, జ్ఞానరేఖల పొడవు కొలిచి కలపాలి. ఈ మొత్తాన్ని 11 చేత భాగించాలి.

వచ్చే లబ్ధం జననకాలంగా నిర్ణయించాలి.

## 14. అంగుష్ఠనాడిని బట్టి జననకాల అంచనా

నాలుగు వ్రేళ్లపైన లంబరేఖల్ని కొలవండి. స్పష్టంగా కన్పించే వాటినే లెక్కలోకి తీసుకోవాలి. అవి ఎన్ని ఉన్నాయో వాటిని మొత్తం చేసి రెండుతో గుణించి మూడుతో భాగించండి. వచ్చే ఫలితం ఎన్ని నిముషాలుందో చూడండి! అది సూర్యోదయానంతర జననకాలంగా గుర్తించండి.

సూత్రం : 1వ + 2వ + 3వ + 4వ వ్రేలి లంబరేఖలు × 2 /3 = కాలం.

ఉదాహరణకు - ఇలా లెక్కించగా వచ్చిన కాలం 140 అని ఉందనుకుందాం! గంటకు 60 ని॥ చొప్పున 140/60 = 2 గం- 20 ని॥. ఇది సూర్యోదయానంతరం 2 గం -20 ని॥ లెక్క తీసుకుంటే, సూర్యోదయం 5.30కి జరిగిందనుకుందాం! అనగా జాతకుడు 7 గం- 50 ని॥లకు జన్మించినట్లు తేలుతుంది.

**మరో సూత్రం ప్రకారం :**

ఎవరి రాశి ఏదయితే ఉంటుందో, అదే సంఖ్య చేత 12ను గుణించి రెండు చేత భాగించాలి. ప్రస్తుత సంవత్సరం నుండి ఆ లబ్ధం తీసేస్తే, ఆ వ్యక్తి జన్మించిన సంవత్సరం తేలుతుంది.

ఒక జాతకునిది కన్యారాశి అనుకుందాం! ఇది రాశి చక్రంలో (12 రాశుల్లో) 5వది. కనుక 12 × 5 = 60/2 = 30. ప్రస్తుతం సం॥ 2002 లోంచి 30 తీసేస్తే = 1972 వస్తుంది. అది అతడి జనన వత్సరం అన్నమాట!

## 15. గణిత అద్భుతాలు (సంవత్సరం కనుగొనుటలో - క్రీస్తు శకాన్ని అనుసరించి)

సాయన సూర్య సిద్ధాంతాన్ని అనుసరించి, ఒక జాతకుని జన్మ మాసం రవి సంచారాన్ని బట్టి ఉంటుంది. ఉదాహరణకు మేషరాశిలో సూర్య సంచారం ఉంటే, జాతకుని జననం వైశాఖంలో జరిగిందని గ్రహించాలి!

ఇక్కడ ఇవ్వబడిన పట్టిక ప్రకారం, ఆయా రాశులు, వాటిని బట్టి సూర్యసంచార మాసాలు (క్రీస్తు శకాన్నిబట్టి) సరిచూసుకోవచ్చు!

| సాయన సూర్యరాశి | జనన మాసం |
|---|---|
| మేషం | 14 ఏప్రిల్ - 14 మే |
| వృషభం | 15 మే - 14 జూన్ |
| మిధునం | 15 జూన్ - 16 జులై |
| కర్కాటకం | 17 జులై - 16 ఆగస్టు |
| సింహం | 17 ఆగస్టు - 16 సెప్టెంబరు |
| కన్య | 17 సెప్టెంబరు - 17 అక్టోబరు |
| తుల | 18 అక్టోబరు - 15 నవంబర్ |
| వృశ్చికం | 16 నవంబర్ - 15 డిసెంబర్ |
| ధనుస్సు | 16 డిసెంబర్ - 13 జనవరి |
| మకరం | 14 జనవరి -12 ఫిబ్రవరి |
| కుంభం | 13 ఫిబ్రవరి - 14 మార్చి |
| మీనం | 15 మార్చి - 13 ఏప్రిల్ |

**కృష్ణ పక్ష - శుక్ల పక్ష నిర్ణయం :**

యత్ర రాశౌ భవేత్సూర్యస్త సంపద్గృహాంతరే ।
చంద్రే శుక్లో భవేత్ పక్షశ్చాన్యథా కృష్ణేపక్షకః ॥

## జాతకుని చక్రాన్ని అనుసరించి :

ఈ పట్టిక ప్రకారం, ఏ సమయమందు జన్మించినదీ తెలుసుకోవచ్చు!

| ఎన్నవ ఇంట ఉన్నాడు? | ఏ టైమ్‌లో జననం |
|---|---|
| 1. సూర్యుడు లగ్నంలో ఉంటే | సూర్యోదయ వేళ |
| 2. సూర్యుడు 12వ ఇంట ఉంటే (లగ్నం నుండి) | ఉ. 6-7 మధ్య |
| 3 సూర్యుడు 11వ ఇంట ఉంటే | ఉ. 8-9 మధ్య |
| 4. సూర్యుడు 10వ ఇంట ఉంటే | ఉ. 10-11 మధ్య |
| 5. సూర్యుడు 9వ ఇంట ఉంటే | 12.00 మధ్యాహ్నం |
| 6. సూర్యుడు 8వ ఇంట ఉంటే | మ. 1-2 మధ్య |
| 7. సూర్యుడు 7వ ఇంట ఉంటే | 2-4 మధ్య |
| 8. సూర్యుడు 6వ ఇంట ఉంటే | సాయంత్రం 5-6 మధ్య |
| 9. సూర్యుడు 5వ ఇంట ఉంటే | రాత్రి 7-8 మధ్య |
| 10. సూర్యుడు 4వ ఇంట ఉంటే | రాత్రి 9-10 మధ్య |
| 11. సూర్యుడు 3వ ఇంట ఉంటే | 11-12 అర్థరాత్రి |
| 12. సూర్యుడు 2వ ఇంట ఉంటే | 1-3 రాత్రి |
| 13. సూర్యుడు 1వ ఇంట ఉంటే | 4-6 సూర్యోదయం ముందు |

భారత జ్యోతిష సిద్ధాంతం ప్రకారం సూర్యోదయమే ప్రామాణిక కాలం. విదేశాలలో మొదటి అర్థరాత్రి నుండి తదుపరి అర్థరాత్రి వరకు ఒకరోజు.

**జన్మ నక్షత్రాన్ని కనుక్కోవడం :**

ఏ నక్షత్రంతో చంద్రోదయం ప్రారంభం అవుతుందో, అదే పేరుతో చాంద్రమానం నెలలు ప్రారంభమై ఆ పేర్లే స్థిరపడ్డాయి.

| నెల | పూర్ణచంద్రుడ్ని కూడిన నక్షత్రం |
|---|---|
| 1. చైత్రం | చిత్త |
| 2. వైశాఖం | విశాఖ |

| | |
|---|---|
| 3. జ్యేష్ఠం | జ్యేష్ఠ |
| 4. ఆషాఢం | పూర్వాషాఢ |
| 5. శ్రావణం | శ్రవణం |
| 6. భాద్రపదం | పూర్వాభాద్ర |
| 7. ఆశ్వీజం | అశ్విని |
| 8. కార్తీకం | కృత్తిక |
| 9. మార్గశిరం | మృగశిర |
| 10. పుష్యం | పుష్యమి |
| 11. మాఘం | మఖ |
| 12. ఫాల్గుణం | పూర్వఫల్గుణి |
| 13. పునర్వసు | |
| 14. ఆశ్లేష | |
| 15. హస్త | |
| 16. స్వాతి | |
| 17. అనూరాధ | |
| 18. మూల | |
| 19. ఉత్తరాషాఢ | |
| 20. ధనిష్ఠ | |
| 21. శతభిష | |
| 22. భరణి | |
| 23. రోహిణి | |
| 24. ఆరుద్ర | |
| 25. ఉత్తర ఫల్గుణి | |
| 26. ఉత్తరాభాద్ర | |
| 27. రేవతి | |

మొత్తం : 27

పై నక్షత్ర మార్గంలో గ్రహసంచారం జరుగుతుంది. చంద్రుడు రోజుకో నక్షత్రం పైన సంచరిస్తూ 27 రోజులలో 27 నక్షత్రాలూ చుట్టిరాగలడు. ఏ నక్షత్రంపై సంచరిస్తున్నపుడు మనం జన్మించామో, అది మన జన్మతార అవుతుంది. జన్మ నక్షత్రం ఏ రాశిలో ఉంటే - అది జన్మరాశి అవుతుంది.

**జన్మ నక్షత్రానికి అనుకూల నక్షత్రాలు :**

1. అశ్విని : భరణి, ఆర్ద్ర, హస్త, స్వాతి
2. భరణి : అశ్విని, పునర్వసు
3. కృత్తిక · ఆర్ద్ర, హస్త, స్వాతి, పుష్యమి, ఉత్తరాభాద్ర
4. రోహిణి : కృత్తిక, ఆశ్లేష, రేవతి
5. మృగశిర : పుష్యమి, స్వాతి, అనూరాధ, మూల
6. ఆర్ద్ర : భరణి, పునర్వసు, పుబ్బ, రేవతి
7. పునర్వసు : ఆరుద్ర, మఖ, అనూరాధ, మూల
8. పుష్యమి : భరణి, రోహిణి, ఆశ్లేష, హస్త
9. ఆశ్లేష : అశ్విని, కృత్తిక, ఉత్తరాషాఢ
10. మఖ : రోహిణి, స్వాతి, శతభిషం
11. పుబ్బ : కృత్తిక, పునర్వసు, మఖ, విశాఖ
12. ఉత్తర : రోహిణి, ఆరుద్ర, మఖ, స్వాతి
13. హస్త : పునర్వసు, ఆశ్లేష, ఉత్తర, రేవతి
14. చిత్త : ఆరుద్ర, పుష్యమి, శతభిషం, ఉత్తరాభాద్ర
15. స్వాతి : పూర్వాషాఢ, భరణి, ఆశ్లేష, విశాఖ
16. విశాఖ : అశ్విని, కృత్తిక, మఖ, ఉత్తరాభాద్ర
17. అనూరాధ : జ్యేష్ఠ, శ్రవణం, హస్త, రోహిణి
18. జ్యేష్ఠ : మూల, ఉత్తరాషాఢ, ధనిష్ట, చిత్త
19. మూల : రోహిణి, ఆరుద్ర, హస్త, స్వాతి
20. పూర్వాషాఢ : కృత్తిక, మృగశిర, ఉత్తర, విశాఖ

21. ఉత్తరాషాఢ : రోహిణి, స్వాతి, హస్త, మూల
22. శ్రవణం : పునర్వసు, ఆశ్లేష, విశాఖ, రేవతి
23. ధనిష్ఠ : పుష్యమి, స్వాతి, శతభిషం, మూల
24. శతభిషం : భరణి, ఆశ్లేష, పూర్వాభాద్ర
25. పూర్వాభాద్ర : కృత్తిక, మఖ, ఉత్తర, మూల
26. ఉత్తరాభాద్ర : రోహిణి, పుబ్బ, హస్త, రేవతి
27. రేవతి . కృత్తిక, మఖ, ఉత్తర, మూల

ఈ ప్రధమ భాగాన్ని ముగించే ముందు, జ్యోతిశ్శాస్త్రాధ్యయనం గురించి కొన్ని మాటలు చెప్పవలసి వుంది. ఇది దైవదత్తమైన విద్య. ఇది సాధించడానికి చాలా శ్రద్ధ కావాలి. చాలా ఓర్పు అవసరం.

తనకు పుట్టిన బిడ్డే అయినా, తండ్రికి సైతం తన పుత్రుని గురించి పూర్తిగా తెలీనట్లే, ఈ శాస్త్రంతో పరిచయం ఉన్నంత మాత్రాన దీని గురించి పూర్తిగా తెలుసుననుకోవడం భ్రమ అవుతుంది.

ఫలితాలు చెప్పడంలో గొప్ప గొప్ప జ్యోతిష్కులే పల్టీలు కొడుతుంటారు. ఇంత గ్రంధం వెలువరించి నంతమాత్రాన, ఈ సంకలనకర్త సైతం సర్వజ్ఞుడనుకోడానికి వీల్లేదు. ఇది ఇంకా 'గారడి విద్య' గానే ప్రజల మధ్య వివాదాల్లో నలుగుతోందన్న అంశం గుర్తు పెట్టుకోవాలి!

ఈ శాస్త్రాధ్యయనానికి కొంత సంస్కృత పరిచయమన్నా ఉండాలి! లేదా బాగా తెలిసిన పండితులు అండగా ఉండాలి. కేవలం పుస్తక పరిజ్ఞానంతో ఫలితాలు చెప్పడానికి తయారు కారాదు. శాస్త్రరహస్యాలు కూలంకషంగా చర్చించడానికి విస్తారమైన గ్రంధం కావాలి! ఉదాహరణకు ఈ ఒక్క అంగుష్ఠ నాడీ జాతకమే ఎన్నో అంశాలతో ముడిపడి ఉంది. ఇవన్నీ గ్రంథంలో వివరించాలంటే, వెయ్యి పుటలకు పైగా గ్రంధం కాగలదు.

ఈ పుస్తకం ఒక చిన్న కరదీపిక మాత్రమే!.... అనగా చేతి సాయం వంటిది మరింత మధించే ప్రయత్నంలో లోతులకు వెళ్లదల్చుకున్న వారు చేయదగ్గ పని.

# ద్వితీయ భాగం

## భవిష్యత్ చెప్పే రీతి - ప్రయోగ ప్రకరణం

పురాణాల్లో చెప్పబడినట్లు ఉసురు లేదా ప్రాణమనేది 'బొటనవ్రేలు'లో దాగి వుందని - దానికి హృదయ స్పందన నాడులతో నేరుగా సంబంధం ఉందని రుజువు చేయదగ్గ ఓ సంఘటన పరిశీలిద్దాం!

శ్రీ కృష్ణుడంతటి పురాణ పురుషుడి ప్రాణం, ఓ విలుకాని బాణం. .. అదీ బొటనవ్రేలికి తగిలి నిర్యాణ కారణమైంది. స్థూలంగా బైటికి కనిపించేది అవతార పరిసమాప్తి కావచ్చు గాని, అంతరార్ధ పరంగా చూస్తే - ప్రాణనాడులతో సంబంధం కలిగివున్నందు వల్లనే, ఈ భౌతిక దేహానికి (బొటన వ్రేలి ద్వారా) తగిలిన దెబ్బ ఉసురు పోవడానికి మూలమైంది. అంటే ప్రాణవాయు ప్రసరణకీ - కాలి బొటనవ్రేలికీ సంబంధం ఉంది.

ఇది మనకంటే ముందే చైనావారు కనుగొనడం వల్లనే కాబోలు. .. ఆక్యుపంచర్ అనే సూదుల వైద్యంలో - బొటన వ్రేలికున్న సున్నితమైన నాడులను కనుగొని, వాటికి సూదులతో వత్తిడి తెచ్చి కొన్ని రకాల రోగాలను నయం చేయగల్గుతున్నారు.

కొన్ని దేవుళ్ల ప్రతిమలు ప్రతిష్ఠించడానికి, అంగుష్ఠమాత్ర (ప్రమాణంగల) విగ్రహాలు నిర్దేశించారు మన మహర్షులు.

మూర్తి రహస్యం 3/4 శ్లోకం 'అంగుష్ఠ మాత్ర ప్రతిమాం - ప్రవిధామ విశేషతః' అని చెప్పుచున్నది.

అంతా బాగానే వుంది. గానీ ఈ బొటన వ్రేలి ప్రమాణంగల ప్రాణం కనుక్కోవడం ఎలా?....

పూజ చేసేముందు ధరించే తిలకం అనామిక (ఉంగరపు వ్రేలితో) అద్దుకొనే మనం, పూజానంతరం భగవంతుని (కుంకుమార్చన ప్రసాదం) బొట్టు ఇతరులకు అద్దవలసి వస్తే - అంగుష్ఠం వాడటం మనం గమనించాలి. దీని ద్వారా ప్రాణోపాసన చేసి, ఆ భగవత్ శక్తిని ఎదుటివారికి బొటనవ్రేలి ద్వారా అద్దుతున్నట్లు అర్థం!

అంటే.... ఇందులో దాగిన ప్రాణశక్తిని, ఇతరులకు శుభం కలిగించేందుకు, తన ఉపాసనాశక్తినీ - భగవంతుని ప్రసాదాన్నీ అంగుష్ఠం ద్వారా ఎదుటివారిలో ప్రవేశ పెడుతున్నాం!

మరో అంశం కూడా ఉన్నది....

దశకంఠ రావణుని గర్వం అణచడానికి, నీలకంఠుడు - ఆ శంకర మహాదేవుడు, కాలిబొటన వ్రేలునే ఉపయోగించినట్లు పురాణగాథ.

బొటన వ్రేలి శక్తికి ఇలా ఎన్ని ఉదాహరణలయినా ఇచ్చుకుంటూ పోవచ్చు!

జైనులలో ఒక శాఖ అయిన మందిర మార్గిజైనుల్లో సన్యాసులు, తమను తాము భగవంతునికి అర్పించుకోవడం (నవవిధ భక్తి మార్గాల్లో అర్పణ ఒకటి!) ముందుగా కాలి బొటనవ్రేలి నుంచి ప్రారంభించి, చివరగా నుదురుతో పూర్తి చేస్తారు. ఇవన్నీ ప్రయోగ విజ్ఞానం క్రిందకే వస్తాయి.

## 16. 'స్పర్శ' ఆధారంగా వర్గీకరణ

జాతకుని జాతకం చెప్పే ముందు జ్యోతిష్యులు సాధారణంగా అరచేతిని జాపమని చెప్పి, ముందుగా వ్రేళ్లు - వాటి గరుకుదనం, మృదుత్వం పరీక్షిస్తారు. ముఖ్యం బొటనవ్రేలి స్పర్శ. వారి లెక్కల ప్రకారం కొన్ని ప్రభావాలు.

**ఫలితాలు :**

1. వెచ్చని స్పర్శ - ఎవరి అంగుష్ఠం తగినంత లావుతో ఉండి వెచ్చగా ఉంటుందో, ఆ వ్యక్తి ఆశావాది. విజయ సాధకుడు. కాని లైంగిక కార్యాసక్తిపరుడు కూడా అయివుండే అవకాశం ఉంది.
2. స్వేద స్పర్శ - శుక్రస్థానంపై ముఖ్యంగాను, ఇతర రేఖలపైన స్వేదం చిమ్ముతున్న స్పర్శ తగిలితే, అట్టి జాతకుడు నిరాశావాది, మానసికంగా చితికినవాడూ అయి వుంటాడు.
3. స్వేద రహిత స్పర్శ - ఇటువంటి స్పర్శ మనోధైర్యాన్ని, ఆ జాతకుని రోగనిరోధక సామర్థ్యాన్ని తెలుపుతుంది.
4. సున్నిత స్పర్శ - మెత్తగా పట్టులాంటి స్పర్శగల జాతకుని అరచేయి, వ్రేళ్లు అతని సంపదకు తెలివితేటలకు ప్రతీకలు. కొందరి విషయంలో ఆత్మవిశ్వాసానికి కూడ.

5. గరుకు స్పర్శ - కష్టించి పనిచేసే తత్వానికి సూచిక.
6 చల్లని స్పర్శ - ఎనీమియా వంటి రోగాలకు, బలం లేమికి ప్రతీక.
7. ఎగుడు దిగుడు స్పర్శ - చేతితో కళ ఉండీ పేదవారై ఉంటారు.

## 17. స్థూలంగా వివిధ అంగుష్ఠ వర్గీకరణలు

రకరకాల బొటనవ్రేళ్లు - వాటి ఆకారాలను బట్టి వర్గీకరణ :

'రమణ సంహిత' ప్రకారం అంగుష్ఠం కొలతలను బట్టి, ప్రధానంగా ఆరు రకాలుగా వర్గీకరించవచ్చు. ఇవి జ్యోతిష్కుని శాస్త్ర విజ్ఞానాన్ని మరింత మెరుగు పరచడం మాత్రమే గాక, అతడు ఖచ్చితమైన ఫలితాలు చెప్పడానికి ఉపకరిస్తాయి.




### స్తంభాకార అంగుష్ఠం :

స్థిరంగా, ఓ స్తంభంలా కనిపించే బొటనవ్రేలి జాతకులకు ఊహాత్మక జీవితం నచ్చదు. కంటికి కనిపించేది మాత్రమే నిర్ధారించుకుని మరీ నమ్మే గుణం గలవారై ఉంటారు. ఓపిక బాగా ఉండే ఈ రకం వ్యక్తులు అత్యున్నత ఉద్యోగాల్లో రాణిస్తారు.

వీరిలో అధికభాగం సాంకేతిక నిపుణులయి ఉంటారు. వీరి 28 - 30 సం॥ల మధ్య కెరీర్ ప్రారంభం అవుతుంది. క్రమంగా ఉన్నత స్థాయికి రాగలరు. వీరికి లగ్నాంశలో కుజుడు ఉండే అవకాశం ఉంది.

### ఖడ్గాకార అంగుష్ఠం :

పైవైపు కొద్దిగా వెనుకకు వంగినట్లుండే ఈ ఆకారాన్ని, స్తంభాకార అంగుష్ఠంతో పోల్చి చూడండి! బొమ్మలో తేడా స్పష్టంగా చూపబడింది.

సాధారణంగా ఇటువంటి అంగుష్ఠం కలిగి ఉన్న జాతకులు ఉన్నత కుటుంబాల్లో జన్మించిన వార్నై ఉంటారు. వీరి బాల్యదశ చాలా సౌఖ్యవంతంగా గడిచే అవకాశం ఎక్కువ. విద్యలలో ఏదో ఒక దానిలో తమ శ్రద్ధ కన్పరిచి ప్రత్యేకత సాధిస్తారు.

విలాసవంతమైన జీవితం గడుపుతారు. ధర్మ న్యాయాలను అభిమానిస్తారు. మర్యాద ఇచ్చిపుచ్చుకుంటారు. మత, సాంఘిక, రాజకీయ కార్యకలాపాల్లో పాలు పంచుకోవడమే గాక, అటువంటి ధార్మిక, మత సంస్థలకు విరాళాలు ఇచ్చి ప్రోత్సహించనూ గలరు.

వీరికి 22 - 25 సం॥ల మధ్య అదృష్టరేఖ అనుభవానికి రావడం ప్రారంభిస్తుంది. సహజంగా వీరిపట్ల స్త్రీలు ఆకర్షితులు కావడం - తద్వారా వీరికి శత్రువృద్ధి; అయినప్పటికీ గ్రహస్థితి అనుకూలించి శత్రువులే మిత్రులుగా మారడం జరుగుతూంటుంది. జాతకంలో శుక్రుని ప్రభావం వల్ల వీరికి 'రాజయోగం' పట్టే దశ కూడా గలదు.

## విలువంపు అంగుష్ఠం

ఈ తరహా బొటనవ్రేలు గలవారికి, గోరు మొలిచే ప్రదేశం వద్ద కొంచెం కణుపు ఆకృతి కలుగుట చేత, బొటనవ్రేలి ఆకారంలో విలువంపు వచ్చినట్లు గుర్తించాలి!

ఈ జాతకులు వాగ్వాదాలంటే ఇష్టపడరు. బాగా చదువుకున్న వారు, మనోధైర్యం గలవారు, మధురమైన కంఠం గలవారూ అయి ఉంటారు. ప్రతికూల పరిస్థితుల్లో సైతం అభివృద్ధికి మార్గాలు వెతుకుతూంటారు. కుటుంబం పట్ల తమ బాధ్యతల్ని అర్థం చేసుకొనే గుణం వీరిలో ఎక్కువ.

జీవితంలో 26వ ఏట ప్రవేశించేవరకూ వీరు ఎన్నో ఒడుదుడుకులు ఎదుర్కొంటారు. 27-31 సం॥ల మధ్య వీరికి తొలిదశ అదృష్టం (కొందరిలో) సహకరించవచ్చు! 36-40 సం॥ల మధ్య అసలైన మలిదశ అదృష్టయోగం కలుగుతుంది. గురుగ్రహ ప్రభావం గల స్త్రీ గాని లేదా ఇటువంటి అంగుష్ఠం కలిగిన స్త్రీ గాని వీరికి లభిస్తే అదృష్టం స్పష్టంగా ఉంటుంది.

## వృత్తాకార అంగుష్ఠం

కొద్దిగా మాత్రమే వెనుకకు వంగగల గుండ్రని ఆకారంగల బొటనవ్రేలు గల వ్యక్తులకు వాగుడు స్వభావం అధికం. మధుమేహం వంటి రోగాలతో బాధ పడతారు.

ఇట్టివారి జాతకంలో చిత్రమేమిటంటే - తమ వాక్ చాతుర్యంతో ఎదుటివారిని ఆకట్టుకోగలుగుతారే గాని, తమలోని లోపాలు గుర్తించనందున అంతగా రాణించలేరు.

ఈ జాతకులలో బాగా విద్యావంతులైనా అయివుంటారు లేదా వ్యవహార జ్ఞానం తెలిసిన నిరక్షర కుక్షులైనా అయి ఉంటారు. ఏదేమైనా తమ జ్ఞానంతో మంచి మాటకారులు. కాని వీరు ఆశించినంతగా ఫలితాలు రాబట్టుకోలేరు. గాలిలో మేడలు కట్టే వీరికి సెంటిమెంట్లూ ఎక్కువే!

ఎంత మాటకారులో, అంత దేహదౌర్బల్యం కలవారు. భార్యల లేదా మామల వల్ల తేలిగ్గా మోసపోతారు.

42-44 సం॥ల మధ్య వీరికి అదృష్టం ప్రారంభం అయ్యే సూచనలున్నాయి. కాని కుటుంబ సమస్యలవల్ల అది గుర్తించేటంతగా కనిపించదు జనన లగ్నంలో చంద్ర బుధులు స్వక్షేత్రములో ఉంటే కొంత ఫలితం కనిపించవచ్చు!

## పక్షిముక్కు ఆకార అంగుష్ఠం

బాగా వెనుకకు వంగగల - పక్షిముక్కును తలపింపజేసే బొటనవ్రేలు కల ఈ జాతకులకు పై అర్థభాగం వెడల్పుగా, గుండ్రంగా ఉంటుంది. వడ్రంగి పిట్ట మెడలా కన్పించగల ఆకృతి వున్న బొటనవ్రేలు గల వ్యక్తులూ ఉండొచ్చు!

కాని, వీరి గోరు భాగం పల్చగా ఉంటుంది. వీరికి తార్కికశక్తి అధికం. కళలపట్ల అభిరుచి ఉంటుంది. భార్యా పిల్లల వల్ల బాగా సమస్యలు ఎదుర్కొంటూ ఉంటారు. తరచు అప్పులు చేసే పరిస్థితి ఎదురుకావచ్చు! 32వ ఏట వీరికి కొంత యోగవంతంగా కనపడినా, 45వ ఏట నుండి సౌఖ్యవంతమైన జీవితం ఏర్పడుతుంది. ఇతరులతో పోల్చుకోవడం మానేసి, తమదైన మార్గంలో కృషి చేయడం వీరికి మేలు.

## సాధారణ అంగుష్ఠం

మొదటి అర్థభాగం కొద్దిగా పల్చగా, ద్వితీయార్థం తగినంత గుండ్రంగాను - సాధారణంగాను ఉండే అంగుష్ఠం గల వ్యక్తులు ఈ కోవలోకి వస్తారు.

గురువులన్నా - పెద్దలన్నా భక్తి అధికం. తమ మానవతా దృక్పథంతో ఇతరులను ఆకట్టుకోగలరు. బుధ శుక్రులు ఇట్టి వ్యక్తుల జాతకంపై ప్రభావాన్ని కలిగి ఉంటారు.

45వ ఏట నుండి జీవితంలో అభివృద్ధి కనిపిస్తుంది. లేనిపోని ఊహల్లో విహరించడం వీరికి నచ్చదు. ప్రేమాభిమానాలు, తార్కిక శక్తి తమకున్న ఇతర గుణాలు వీరికి మేలు చేస్తాయి.

## 18. ఆకృతులు - కన్పించే రీతినిబట్టి వర్గీకరణ

వివిధ అంగుష్ఠాల ఆకృతులు మాత్రమేగాక, వాటికి ఉన్న వొడ్డూ - పొడుగూ కూడా పరిగణనలోకి తీసుకొని వర్గీకరిస్తే 10 రకాల బొటనవ్రేళ్లు గల వ్యక్తులను గుర్తించడం జరిగింది. ఇక్కడ పొట్టి పొడుగులతో పాటు, అవి నెలకొని ఉన్న స్థితిని బట్టి కూడా ఫలితాలు ఇవ్వబడ్డాయి. ఇది జన్మలగ్నం గ్రహస్థితి వగైరా పరిగణనలోకి తీసికొని రూపొందించిన వర్గీకరణ.




1. అభివృద్ధి చెందని రకం
2. లావుగా ఉండే రకం
3. పొడుగ్గా - పల్చగా గల రకం
4. వికృతి కలిగిన రకం
5. సమతలంగా ఉన్న రకం
6. గుండ్రని ఆకృతి రకం
7. విస్తృతి గల రకం
8. మిశ్రజాతి అంగుష్ఠం
9. కణుపు నుండి వృద్ధి చెందిన రకం
10. పూర్తిగా ఎదిగిన రకం

### అభివృద్ధిలేని రకం

మరుగుజ్జులా ఎదుగుదల లేక కన్పించే బొటనవ్రేలు. ఇట్టి వ్రేలు కలిగిన వ్యక్తులు తెలివి హీనులు - చొరవ లేనివారు అయి ఉంటారు. కొందరిలో క్రూరత్వం, జంతు ప్రవృత్తి సైతం సూచితం కాని వీరికి శారీరకబలం మాత్రం అసాధారణంగా ఉంటుంది.

## లావుగా ఉండే రకం

కొందరిలో ఈ రకం వ్రేలు తోలు వొల్చిన అరటిపండు వలె కన్పిస్తుంది. లావుగా బలంగా ఉండే ఇట్టి అంగుష్టాన్ని కలిగిన జాతకులు మానసిక శక్తులు అంతగా అభివృద్ధి చెందని వారై ఉంటారు. గర్విష్ఠులు, మూర్ఖ స్వభావులు కూడా అయి ఉండవచ్చు! ఎలాటి ప్రమాదాల్నీ లక్ష్యపెట్టరు. సంపాదన లేకున్నా సుఖాల కోసం వెంపర్లాడే రకం అయి ఉంటారు.

## పొడుగ్గా - పల్చగా ఉండే రకం

ఈ రకమైన అంగుష్టాన్ని కలిగి ఉండేవారు, సాధారణంగా కళాకారులై ఉంటారు. ఇది మంచి ఆరోగ్యాన్ని - చురుకుదనాన్ని సూచిస్తోంది.

ఈ జాతకులు కవులు, కళాహృదయం గలవారిగా ఉన్నా, జీవితంలో అభివృద్ధి దశ కొద్దికొద్దిగా మెల్లగా జరుగుతుంది కొన్ని సందర్భాల్లో అభివృద్ధి సందేహాస్పదం కూడా వీరు ఖర్చుదారులు. పొదుపు చేయడం వీరి జాతకంలోనే తక్కువ.

## వికృతి కలిగిన రకం

ఈ విధమైన అంగుష్టాన్ని కలిగినవారు మోసకారులు, నయవంచకులు అయి ఉంటారు. కొందరిలో పొగరు నిర్లక్ష్యం కూడా అధిక పాళ్లలో ఉంటాయి. బెదిరించి, గూండాగిరీ చెలాయించీ డబ్బు సంపాదించినా, అది నిలబెట్టు కోలేరు.

## సమతలంగా ఉన్న రకం

బొటనవ్రేలి పైభాగం సమతలంగా అర్ధవృత్తాన్ని స్ఫురించేలా ఉండే రకం. వీరు స్వార్ధపరులు. బాగా డబ్బు ఉన్నా, పిసినారుల్లా జీవిస్తారు. తమ కుటుంబ జీవితంలో కష్టనష్టాలేమీ ఎదుర్కోకున్నా, ఇతరులతో కలవడం గాని - సత్సంబంధాలు కలిగి ఉండడం గాని అరుదు.

## గుండ్రని ఆకృతి రకం

ఈ అంగుష్ఠ రకానికి చెందిన వ్యక్తులు అధికంగా ప్రతిదానికీ ప్రతిస్పందించే వారై ఉంటారు. భావుకులు; ప్రేమికులు అయినా ఈర్ష్య అధికం. త్వరగా ఉద్రిక్తులవుతారు. మంచీ - చెడు, మేలు - కీడుల మధ్య అంతరం తెలుసుకోలేక వ్యధ చెందుతారు.

### విస్తృతి గల రకం

ఈ రకం బొటనవ్రేలు కలిగి ఉన్నవారు, కోపిష్టులు. ఎన్నోసార్లు తమ విషయంలో అది రుజువైనా స్వభావాన్ని మార్చుకోలేరు. అంతలోనే చల్లబడి, అంతలోనే కోపం తెచ్చుకుంటారు.

### మిశ్రజాతి అంగుష్ఠం

.... గలవారు తప్పక 'హంతక జాతి' వారంటున్నాయి విదేశీ జోస్యాలు. ఎలా చూసినా వీరు హింసోన్మాదులై ఉంటారు. కొందరు శాడిస్టులుగానూ ఉండొచ్చు!

### కణుపు నుండి పెరిగిన వ్రేలు

ఇట్టివారి బొటనవ్రేలు మధ్యలో సన్నంగా ఉండి కణుపు వద్ద నుండి పైన లావుగా ఉంటుంది. గొప్ప విద్యావేత్తలవుతారు లేదా రాజకీయవేత్తలవుతారు.

### పూర్తిగా వృద్ధి చెందిన రకం

ఈ రకం బొటనవ్రేలు గలవారిని నమ్మదగ్గ వ్యక్తులుగా పరిగణించవచ్చు! ఆత్మగౌరవం. మతవిశ్వాసాలు వీరికి అధికం. ధనజాతకులు కూడా.

## 19. వెనుక పార్శ్వమునుబట్టి అంగుష్ఠ వర్గీకరణ

అరచేయికి వెనుకవైపు నుండి చూస్తే, బొటనవ్రేలు కనిపించే తీరునుబట్టి, ఐదురకాల అంగుష్ఠాలను వర్గీకరించారు. వాటి పేర్లు ఇవి :



1. సూచ్యాకారము
2. శంక్వాకారము
3. చతురాకారము
4. చేటాకారము
5. అసమ/ విషమాకారం

## 1. సూచ్యాకార అంగుష్ఠం

సూచ్యాకార అంగుష్ఠం చూడడానికి ఆకర్షణీయంగా ఉంటుంది. సాధారణంగా స్త్రీలు ఇటువంటి వ్రేలు కలిగి ఉంటారు. మృదు స్వభావులు. అందాన్ని ఆరాధించేవారు. శారీరక శ్రమ వీరికి గిట్టదు. కాస్త స్వార్థపరులు. కాని మంచి ప్రేమికులు. స్నేహాన్ని ఇష్టపడే వారు అయి ఉంటారు.

## 2. శంక్వాకార అంగుష్ఠం

క్రింది భాగం వెడల్పుగా ఉండి, పైకి వెళ్లే కొద్దీ అంచు సూదిగా ఉండే ఇలాంటి శంకువు ఆకృతి గలిగిన జాతకులు భావుకులు. ఆచరణశీలురు కూడా అయి ఉంటారు. మంచి ఆహారం, తీరైన దుస్తులు, కళాత్మకతలను ప్రేమిస్తారు. సమాజాన్ని కూడా తమలాగే ప్రేమించే తీరు వీరిది.

## 3. చతురాకార అంగుష్ఠం

ఈ అంగుష్ఠం కలిగిన జాతకులు శ్రమశక్తినీ, చర్యాశీలతనూ అభిమానిస్తారు. ఉబుసుపోక కబుర్లూ - ఊహలూ వీరికి నచ్చవు. నిరాడంబరం - కష్టించే గుణం పట్ల విశ్వాసం కలిగి ఉంటారు.

తమ తెలివికీ - తార్కిక శక్తికీ పదును పెట్టి ఆలోచిస్తే గానీ, వీరు మంచినైనా - చెడునైనా నమ్మరు. నిదానంగా న్యాయంగా ధనార్జన చేయడం లక్ష్యంగా పెట్టుకుంటారు. వీరి నిజాయితీ - ధర్మబుద్ధే వీరికి శ్రీరామరక్ష

## 4. చేటాకార అంగుష్ఠం

పైభాగం వెడల్పుగా - క్రిందికొచ్చే కొద్దీ సన్నంగా ఒక విధంగా చెప్పాలంటే శంక్వాకారానికి పూర్తి విరుద్ధంగా ఉండే ఈ తరహా వ్రేలు కలిగినవారు మానసికంగా చాలా చురుగ్గా ఉంటారు. వేదాంతపరమైన - దైవభక్తి పరమైన ఆలోచనలు మెండుగా ఉంటాయి. క్రియాశీలత కలిగిన ఊహలూ ముఖ్యంగా పరిశోధనాత్మక యోచనలూ అధికం. కొత్త ఆవిష్కరణలంటే ఆసక్తి ఇంజనీర్లు, శాస్త్రవేత్తలు, రీసెర్చి చేసేవారు ఈ కోవలోకి వస్తారు.

## అసమాకార అంగుష్ఠం

ఇట్టి జాతకులు అరుదుగా ఉంటారు. అనగా ఈ తరహాలో వ్రేలు కన్పించడం తక్కువ. బందిపోట్లు, హంతకులు, జంతుప్రవృత్తి గలవారు ఈ కోవలోకి చేరతారు.

దేహదారుఢ్యం అధికం. అయితే - ఇతర కారణాల దృష్ట్యా గ్రహ సంపత్తి బాగుండడం వంటివి సంభవిస్తే ... ఇట్టివారు క్రీడాకారులుగా, కోచ్‌లుగా, పోలీసు ఆఫీసర్లుగా రాణిస్తారు.

# 20. అంగుష్ఠ పార్శ్వరేఖల వర్గీకరణ



హస్త జ్యోతిష్కులు ... ముఖ్యంగా పాతతరం సాముద్రికులు బొటనవ్రేలును అటూ ఇటూ త్రిప్పమని చెప్పి, ఒక ప్రక్క భాగమున అడ్డంగా ఉన్న నాలుగయిదు రేఖలను పరిశీలించడం మనలో చాలామందికి అనుభవంలోకి వచ్చే ఉంటుంది.

ఇలా బొటనవ్రేలును ఓ ప్రక్క నుంచి చూసి వారు గణించే విశేషాలేమిటి? ఈ పార్శ్వంలో వారికేం కనిపిస్తుంది? అనేది ఇప్పుడు చర్చిద్దాం.

బొటన వ్రేలికున్న రెండు అర్థభాగాల్ని కలిపే ఈ కణుపు వద్ద ఉండే 4 రేఖలు ఒక వ్యక్తి యొక్క నాలుగు జీవిత దశలకు సూచికలని ప్రాచీన మహర్షులు సెలవిచ్చారు.

అవి : 1. బాల్యం

2. కౌమారం

3. గృహస్థాశ్రమం

4. వానప్రస్థాశ్రమం

## I. బాల్యం (బ్రహ్మచర్య దశ)

కాలానుగుణంగా మొదటి దశ (పై వరుస నుండి) దీనిని సూచిస్తుంది. ఈ దశలో కొన్ని సంస్కారాలు చెప్పబడ్డాయి జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, క్షుర కర్మ, ఉపనయం

మొ॥నవి. ఇవి 14వ ఏట ప్రవేశించే లోగానే జరగాలని శాస్త్రం చెపుతున్నది. ఇది జాతకుని భౌతిక - దైహిక శక్తులకు సూచిక.

## 2. కౌమారం (యవ్వన దశ)

25 ఏళ్లు వచ్చేవరకు ఉండే దశను, ఈ రెండోరేఖ సూచిస్తుంది. ఈ దశలో బ్రహ్మచర్యం అవలంబించాలని -వేదారంభం, పఠనం జరగాలని నిర్దేశించారు. జాతకుని విద్యావిషయక శక్తియుక్తుల ప్రాబల్యం ఈ రేఖని బట్టి చెప్పవచ్చు!

## 3. గృహస్థాశ్రమం :

25 నుండి 50 సం॥ల వయస్సు వచ్చేవరకు గృహస్థాశ్రమ దశగా పరిగణించారు. ఇందులోనే వివాహ విషయం చెప్పబడింది. వైవాహిక ఆనందం, వివాహ స్థితి, పేరుప్రఖ్యాతి, జీవిత గమనదిశలు ఈ రేఖ ననుసరించి ఉంటాయి.

## 4. వానప్రస్థము :

ఈ నాలుగవ రేఖ 50 - 100 సం॥ల మధ్యకాలపు జీవిత దశకు సూచిక చివరి దశ లేక సన్యాస స్వీకరణకు అనువైన దశ అని కూడా అభివర్ణించవచ్చు! ఈ అంత్యదశ తీర్థయాత్రానురక్తిని కలిగిస్తుంది.

పై నాలుగు రేఖలూ బొటనవ్రేలి పార్శ్వమున ఖండాలు (cuts) లేకుండా ఉంటేనే - స్ఫుటంగా ఉంటేనే ఫలితాలు వర్తిస్తాయి. కొందరికి చివరి (క్రింది) రెండు రేఖలూ స్పష్టంగా కనిపిస్తాయి. అట్టివారికి జీవితంలో 45వ సం॥ నుండి మంచిదశ ప్రారంభమవుతుంది. మొదటి రెండు రేఖల్లోనూ తగినంత స్పష్టత లోపిస్తే విద్యా విషయకమైన అవరోధాలు ఎదురుకావచ్చు!

## 21. అంగుష్ఠంపై 'యవ' రేఖను బట్టి వర్గీకరణ




'యవ రేఖ'నే కొన్ని ప్రాంతాల్లో ద్వీపరేఖ అనీ, తూర్పు కోస్తా ప్రాంతంలో 'వడ్లగింజ' అనీ పిలుస్తారు. బొటనవ్రేలికి పై ఉపరితలం మీద ధాన్యపు గింజ ఆకృతిలో ఉంటుంది.

కొందరి విషయంలో అరచేతిలో ఇటువంటి ఆకృతిగల రేఖ అరుదుగా కనిపిస్తుంది. ఏది ఎలా ఉన్నప్పటికీ - ఇది శుభసూచకం - సత్ఫలదాయిని.

ప్రాచీనులు కూడా ఇట్టి రేఖని పుష్పరేఖ అని వ్యవహరించారు. ఇంతకుముందు చెప్పిన వివిధ దశల్లో సౌఖ్యవంతమైన జీవితానికిది గుర్తు.

బొమ్మలో చూపినట్లు - ఈ రేఖ అంచులు బాల్య, వార్ధక్య దశలను సూచిస్తే, మధ్య ( ) బ్రాకెట్ ఆకారం గల చోట - నడివయసును సూచిస్తుంది.

ఎక్కడా ఖండనలు లేని సంపూర్ణ రేఖలు - యోగదాయకతకు గుర్తు. జీవితంలో సుఖశాంతులు అనుభవిస్తారు. అదృష్టం వికసిస్తుంది. ఇది ద్వీపంలా విస్తరించే ఆకారాన్ని బట్టి కూడా ఫలితాలుంటాయి.

సాధారణంగా 7.5 మి.మీ. ఉండే ఈ రేఖను 7గా విభజించి 13 సం॥ల కాలం ఒక్కొక్క భాగంలోనూ ఉండేలా అంచనా వేశారు. (సగటు జీవితకాలం 90 సం॥)




సంప్రదాయ కుటుంబంలో జన్మించిన వారై ఉండే ఈ రేఖ గలవారికి బాల్యంలో రోగాలుండవు. కాని, వీరికి 45-48 సం॥రాల మధ్యకాలంలో గాని ఉచ్ఛదశ అనుభవానికి రాదు.

పై బొమ్మలో చూపినట్లు 'యవరేఖ'లో 21 రకాలున్నాయి. ముఖ్యంగా ఇది కన్పించే రీతి లేదా ఏర్పడ్డ రీతిని బట్టి సాముదాయికంగా ఈ ఫలితాలు చెప్పబడ్డాయి. పై నుండి వరసగా 1, 2, 15, 21 ఉత్తమ ఫలితాలలోకెల్లా ఉత్తమోత్తమ ఫలదాయకం. మిగిలినవాటిలో 5, 17, 18 శూన్య (అనుభవంలోకి రాని) ఫలదాయకం. శేషించిన వన్నీ మిశ్రమ ఫలితాల్ని ఇస్తాయి.,

1. పూర్తియవ రేఖ : జాతకునికి మహర్దశ సూచకం. పుత్ర సంతానరీత్యా గర్విష్టి.
2. ద్వయయవ రేఖ : మధ్యభాగం రెండుగా విడివడే అవకాశం ఇచ్చింది. సంపత్కారకం.

3. **అసంపూర్ణ యవరేఖ** . పిత్రార్జిత ధనప్రాప్తి. స్వయం ఆర్జన ఉన్నా, అంచనాకంటే తక్కువగానే లభిస్తుంది.
4. కేవలం ఒక గీతవలె ఉండే ఈ రేఖ స్వార్జితాన్ని సూచిస్తుంది. అదీ 32వ ఏట నుండి.
5. చుక్కల గీతలా కనిపించే ఈ రేఖ మహా కష్టదాయిని.
6. తరంగాల - అలలవలె ఉండే రేఖ మనోవైకల్య సూచిక. ఇట్టి రేఖ గలవారికి లాటరీ, జూదాల యందు ఆసక్తి.
7. ఒక సరళరేఖను తాకుతూ అలలరేఖ ఏర్పడేలా కనిపించే ఇట్టి జాతకులకు మాతృసౌఖ్యం ఉండదు.
8. ఒకే రేఖ వలె ఉండి మధ్యలో ఇంగ్లీషు అక్షరం V వలె ఉంటే యవరేఖ, నడిమి వయసులోగాని సంతానం కలిగే యోగం లేదని సూచిస్తుంది.
9. పై రేఖ వలెనే ఉండి V ఆకారానికి అడ్డంగా మరో చిన్న గీత వల్ల త్రికోణం ఏర్పడినట్టు ఉంటే - అతడికి సంతానమూలక సుఖప్రాప్తి ఉంటుంది.
10. బాల్యం నుండి మూర్ఖత - నిరాదరణ, కష్టజీవి
11. బాల్యంలో కష్టాలు, నడిమి వయసులో సుఖం.
12. నడిమి వయసులో బంధువుల - స్నేహితుల వల్ల ధనప్రాప్తి.
13. అయిన వాళ్లందరికీ దూరమై 30వ ఏట నుండి సుఖం.
14. నిర్లక్ష్య జీవి. పిత్రార్జిత ఆస్తిని సైతం అమ్మేసే ఛాన్సుంది.
15. చేప ఆకృతిగల ఈ రేఖ ఆనంద సూచిక. సుఖిస్తాడు.
16. శారీరక శ్రమ అధికం. ఆరాటం ఉన్నా ఉన్నత స్థాయికి చేరరు.
17 ఒకానొక-దశలో ఆత్మహత్యకు సైతం పాల్పడే స్థితి రావచ్చు!
18. బాల్యంలో దురదృష్టవంతులు. యవ్వనారంభదశ మంచిది.
19. విలాసవంతమైన జీవితం వీరికి వడ్డించిన విస్తరి.
20. జాతకరీత్యా గ్రహదశ బాగుంటే, వివాహానంతర సుఖం.
21. యవరేఖ నేత్రాకృతిలో (మధ్యలో నలుసంత బొట్టుతో కలిసి) ఉంటే రాజయోగమే!



కాని, ఇలా ఉండడం చాలా అరుదు. ఇతరుల హృదయాన్ని చదవగలిగే నేర్పు ఉంటుంది వీరికి. ప్రఖ్యాత సాముద్రికుడు కీరోకి ఇలాంటి యవరేఖ ఉండేదట!

## 22. అంగుష్ఠంపై అన్ని రేఖల్ని బట్టి వర్గీకరణ




యవరేఖతో పాటు మరికొన్ని ఇతర రేఖలూ బొటనవ్రేలిపై కనిపిస్తాయి. నిపుణులైన రుషులు వీటికి 9 పేర్లు సూచించారు. అవి ఇవి :

1. పుష్ప లేదా ఫలరేఖ
2. మధుర రేఖ
3. మందర రేఖ
4. మాన రేఖ
5 రతి రేఖ
6 మల్లిక రేఖ
7. వజ్ర రేఖ
8. కేసర రేఖ
9. రిపు రేఖ

అన్ని రేఖలూ అందరిలోనూ కనిపించకపోవచ్చు! కానీ పరిశీలిస్తే కొన్ని రేఖలైనా పసిగట్టవచ్చు! వాటి ఫలితాలు ఇలా ఉంటాయి.

**1. పుష్పరేఖ :** ఇది గతంలో మనం చర్చించిన యవరేఖ. ఇది స్ఫుటంగా ఉంటే కలిగే ఫలితాలూ - దీనిలో వైవిధ్యం గత అధ్యాయంలో వివరంగా ఇవ్వబడ్డాయి దీనికి సంబంధించిన మరికొన్ని విశేషాంశాలు : ఈ రేఖ అస్పష్టంగా అలుక్కుపోయినట్లున్నచో బాల్యంలో కష్టాలు అయినప్పటికీ - తిండికీ బట్టకూ లోటుండదు. అస్పష్టతతో, విద్యావిషయక అవరోధాలూ ఎదురుకావచ్చు! 28 సం॥లు వచ్చేవరకు కష్టజీవిగానే ఉండే అవకాశం అధికం.

ఒకవేళ యవరేఖపై గొలుసు లింకులు గాని ఉంటే, అట్టి జాతకుడు దయలేని వాడై ఉంటాడు.

నారద సంహితలో ఇది పరాగ రేఖగా చెప్పబడింది. ఈ రేఖ స్ఫుటంగా గలవారు ప్రస్తుత కాలమాన పరిస్థితిని బట్టి పూర్ణాయుష్కులని (దాదాపు 90 సం॥) చెప్పవచ్చును. ........ ఈ ప్రక్కన సూచించిన రీతిలో ఎ అనే ఊర్ధ్వరేఖ ఆయుః ప్రమాణాన్ని; బి అనే అధోరేఖ దాంపత్య జీవితాన్నీ సూచిస్తుంది ఎలాంటి ఖండాలు (కట్స్) లేనట్లయితే జీవితం సాఫీగా సాగుతుంది.

ఈ రేఖ మీనాకృతిలో ఉంటే, జాతకుడు నిత్యం శ్వాసకాస రోగాలతో బాధపడే అవకాశాలున్నాయి.

**2. మధుర రేఖ :** ఇది చిన్న రేఖ. కాని విజయ సూచిక మెరుస్తూన్నట్టు కొందరిలో కనిపిస్తే, అట్టివారు ధనికులు. విశాల హృదయులు అయి ఉంటారు.

**3. మంధర రేఖ :** బొమ్మలో చూపిన రీతిలో ఇది కనిపిస్తుంది. ఇది గలవారు విదేశీయానం చేస్తారు.

**4. మాన రేఖ :** పురుషులలో ఇది సాధారణంగా కనిపిస్తుంది. వీరికి స్త్రీ సంబంధాలు హెచ్చు! ఇదే రేఖ స్త్రీలలో కన్పిస్తే, పరపురుష సంపర్కం అధికం.

**5. రతి రేఖ :** ఇదే మోహినీ రేఖగానూ పిలువబడుతోంది పేరు రీత్యా ఇది లైంగికానంద రీతిని సూచిస్తున్నది కదా!

ఇది దాంపత్య సుఖ జీవనానికి ప్రతీక ఒకవేళ ఈ రేఖ ఇతర చిన్న రేఖలతో కూడి ఉన్నట్లయితే అట్టి వ్యక్తికి వివాహేతర సంబంధాలు కూడా ఉంటాయి. ఇదే రేఖ మెలిపెట్టిన త్రాడు వలె ఉంటే - ఆ వ్యక్తికి ఇద్దరు భార్యలు, ఒక కొడుకు ఉండే అవకాశం ఉంది. ఈ రేఖ మీద నల్లమచ్చ ఉంటే, ఆ జాతకుని భార్య రోగంతో మరణించవచ్చు!

**6. మల్లిక రేఖ :** ఈ రేఖ మీద చేప, జెండా, ఆకు, పాము వంటి ఆకృతులు కనిపిస్తే జీవితాంతం అతడికి కీర్తిప్రతిష్ఠలుంటాయి.

ఈ రేఖ దంతం, తేలు ఆకృతులలో ఉంటే బహుముఖ ప్రజ్ఞాశాలి అయి ఉంటాడు. ఇది నీలం ఊదారంగుల్లో కనిపిస్తే అతడు దీర్ఘరోగి కావచ్చు!

**7. వజ్ర రేఖ :** దీన్ని 'హీరకరేఖ' అని కూడా అంటారు ఇది గలవారికి శుక్రుని గ్రహసంచారం ఉన్న సమయాలలో మేలు తథ్యం. దీనికి కేసరరేఖ కూడా తోడైతే (అది కూడా ఆ వ్యక్తి కలిగి ఉన్నచో) అతడు లక్షాధికారి.

**8. కేసర రేఖ :** ఇది బాగా స్ఫుటంగా కనిపిస్తే, ధనార్జన బాగుంటుంది. ఊహించని శత్రువులుంటారు. కాని ఈ రేఖ సర్పాకృతిలో ఉంటే మాత్రం మనోవేదనకు దారి తీయవచ్చు!

**9. రిపు రేఖ :** ఇది అమంగళ రేఖ. దీని పేరును బట్టే ఇది శత్రువృద్ధికరంగా భావించదగింది. ఇది బలహీనంగా ఉన్నప్పటికీ - మృత్యుంజయ యజ్ఞం చేయడం క్షేమకరం.

## కోణీయ వర్గీకరణ

అంగుష్ఠానికి ఉన్న మరో ప్రత్యేకత - ఇది మిగిలిన అన్ని వ్రేళ్ల వలె అరచేతికి పొడిగింపు వలె కాకుండా ఒక ప్రక్కన అమరి ఉండటం. దీనివల్ల చూపుడు వ్రేలుకు, బొటన వ్రేలుకు మధ్య లంబ, లఘు, గురు కోణాలుండే రీతిలో అమరిక ఉంటుంది

**1) లఘు కోణ అంగుష్ఠం :** అరచేతికున్న చూపుడువ్రేలు సరళ రేఖ నుండి 40° – 80° కోణంలో ఉంటుంది.

**2) లంబకోణ అంగుష్ఠం :** సరిగ్గా ఇదే రేఖకు 90° కోణంలో ఉంటుంది.

**3) గురుకోణ అంగుష్ఠం :** చూపుడువ్రేలు సరళరేఖకు 90°–180° కోణంలో ఉంటుంది.




1. ఈ తరహా బొటనవ్రేలు గల జాతకులు సాధారణంగా పొట్టివారై ఉంటారు. వీరు దిగువ లేదా మధ్యతరగతికి చెందుతారు విద్యాగంధం అంటదు. మతవిశ్వాసాలూ అంతంత మాత్రమే! వీరికి మూఢ విశ్వాసాలు అధికం. దయ్యాల్నీ మంత్రగాళ్లనీ నమ్ముతుంటారు. తమోగుణం వల్ల కొందరిలో సోమరులు కూడ ఉండొచ్చు!

నిషేధింపబడిన ఆహారాలు భుజించేవారు, నీచ స్త్రీ సంపర్కులు (పురుషుల విషయంలో) బూతులు మాట్లాడేవారు అయి ఉంటారు. చిత్రమేమిటంటే - గౌరవప్రదమైన కుటుంబాల్లో జన్మించినవారైనా పై లక్షణాలు; కొంత వంచన గుణం, మోసగుణం ద్యోతకం అవుతూంటాయి.

2. ఈ తరహా బొటనవ్రేలు గల జాతకులు అందం, ఆరోగ్యం, చక్కని రూపం కలిగిన వారై ఉంటారు. వీరి అంగుష్ఠం బలంగా పొందిగ్గా ఉంటుంది.

ఈ జాతకులు రజోగుణం ప్రధానంగా కలవారు. ప్రపంచజ్ఞానం, తెలివితేటలు, చదువు బాగా ఉన్నవారు విశేషించి ఈ జాతకులలో ప్రతీకారగుణం కూడా తీవ్రస్థాయిలోనే ఉంటుంది. ఉన్నతోద్యోగులు, ఇతరులకంటే అధికంగా సంపాదనాపరులు అయి ఉంటారు. స్నేహం కోసం ప్రాణత్యాగానికైనా వెరవనంత ధైర్యస్తులు. అంతేస్థాయిలో అవసరమైతే ప్రాణం తియ్యగలరు కూడ. వీరికి సెంటిమెంట్లు కూడా ఎక్కువే!

డాక్టర్లు, లాయర్లు, రచయితలు - వీరిలో ఇటువంటి వ్రేలు కలిగిన వారు ఉండొచ్చు.

3. ఈ తరహా అంగుష్ఠం కిగిన జాతకులు తీవ్రమైన స్పందన గుణం కలిగిన వారై ఉంటారు. పొడుగ్గాను - ప్రతికూల పరిస్థితుల్లో సైతం విద్యను ఆర్జిస్తారు. సంగీతము, శిల్పము వంటి లలిత కళలలో ప్రవేశం ఉంటుంది.

వీరి చర్యలు చాలాపెద్ద మనిషి తరహాలో ఉండి, సంభాషణ మధురంగా వుంటుంది. వీరు కొద్దిపాటి శ్రమతోనే, ఎప్పటికప్పుడు కాలానుగుణంగా తమ అభిప్రాయాలు మార్చుకుంటూనే నెమ్మదిగా విజయం వైపు పయనిస్తారు. ఈ సందర్భంగా బొటనవ్రేలి పొడవు కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది.

## 24. వంగే (చలించే) గుణాన్ని బట్టి వర్గీకరణ

దీనినే 'అనమాయత మూలకవర్గీకరణ' అని కూడ అంటారు ఇది మొదటి కణుపు వద్ద చలించే గుణాన్ని పరిగణనలోకి తీసుకొని ఫలిత నిర్దేశం చేయడం జరిగింది.

ఇది రెండు విధాలుగా జరుగుతుంది.

1. స్థిరంగా ఉండే గట్టి అంగుష్ఠం.

2. చలించే (వంగే) గుణంగల అంగుష్ఠం





1. ఈ రకం బొటనవ్రేలి జాతకులు గట్టి ఆత్మవిశ్వాసపరులయి ఉంటారు. ఎంతటి ప్రతికూలం ఎదురైనా ధైర్యం కోల్పోరు. వీరికి రోగనిరోధక శక్తి; ఇతరులకు చెందిన రహస్యాల్ని కాపాడే శక్తి కూడా అధికం. వీరు ఎవరితోనైనా స్నేహం చేస్తే అది జీవితాంతం కాపాడుకోడానికి ప్రయత్నిస్తారు. ఇతర వ్రేళ్లూ గట్టిగా ఉంటే నేరస్తులు కాగలరు.

2 ఈ రకం బొటనవ్రేలు గల జాతకులు మృదు స్వభావులై ఉంటారు. విశాల దృక్పథం గలవారై ఉంటారు. ఇతరులకు సహాయపడే గుణం కూడా ఉంటుంది.

సౌఖ్యవంతమైన జీవితం గడుపుతారు. వీరు ఉండే చోట ఆహ్లాదకర వాతావరణం ఉంటుంది. కళాజీవులు, కళారాధకులు కాగలరు. తమ వాదమే నెగ్గాలనే పట్టుదలలకు పోకుండా, ఇతరులనూ మన్నిస్తారు.

## 25. ఉపరితల పార్శ్వాన్నిబట్టి వర్గీకరణ




ప్రతి అంగుష్ఠం మూడు తలాలు కలిగ్గి ఉంటుంది అరచేతివైపు తలము, వెనుకవైపు ఉపరితలం, పార్శ్వతలము. మొదటిభాగం గోరును అంటుకొని ఉండేది. రెండోభాగం కణుపు వద్ద నుండి; మూడో భాగం అరచేతిని కలిపి ఉబ్బెత్తుగా ఉండే శుక్రస్థానం. (బొమ్మ చూడండి!)

కొందరి అభిప్రాయం ప్రకారం - మొత్తం వ్రేలు మూడు భాగాలు (ఉపరితలాలతో సంబంధం లేకుండా) మరికొందరి అభిప్రాయం ప్రకారం = గోటివైపు నుండి వరుసగా సత్వ, రజో, తమో గుణాలకు ఈ మూడు తలాలు ప్రతీకలు.

ఏదేమైనా గానీ ఈ విభాగాలు మూడు ప్రత్యేకాంశాలను సూచిస్తాయి

1 పై ఉపరితలం (గోరుతో కూడినది) ఆత్మవిశ్వాసానికీ, విజ్ఞానానికీ, ఆలోచనలకూ పరిగణించాలి.

2. ప్రక్క ఉపరితలం (కణుపుతో కూడినది) తర్కానికీ, ప్రజ్ఞకూ, వ్యవహారజ్ఞానానికీ పరిగణించాలి.

3. కింది ఉపరితలం ప్రేమ, అనురాగం, బంధాలు, స్నేహం వంటి అంశాల పరిగణనకు చూడదగ్గది.

**1) పై ఉపరితలం :** అది భౌతిక శక్తులయినా (ఆత్మ శాశించగల) భౌతిక శక్తులనైనా పరిశీలించాలంటే - జాతకుని యొక్క ఈ భాగాన్ని చూడాలి! రెండో తలంకంటే మొదటి (పై) ఉపరితలం పొడుగ్గా ఉన్నవారు - స్వతంత్రించి నిర్ణయాలు తీసుకొనే గుణం కలిగనవారయి ఉంటారు. కాని వీరికి చాలా నిర్ణయాలు కలసి రావు. వీరిలో అహం అధికం.

రెండోది - మొదటిదీ తలాలు సమానంగా గలవారు, సమాజంలో గౌరవస్థానంలో ఉంటారు. అంతేగాక విజయం వీరిని వెన్నంటే ఉంటుంది. వీరు ఇతరుల్ని మోసగించడం గాని - ఇతరులు వీరిని మోసగించడం గాని జరగదు. ఎక్కువమంది సన్నిహితులతో త్వరగా ప్రజాదరణ పొందగలరు. ప్రతికూల పరిస్థితులలో సైతం వీరిదే గెలుపు.

బొటన వ్రేలు ఎత్తును బట్టి వ్యక్తి ఎత్తు నిర్ణయించడం! :

| బొటనవ్రేలి సైజు (అంగుళాలలో) | మనిషి ఎత్తు (అడుగులలో) |
|---|---|
| 1) 2.5 సెం.మీ. / 3 సెం.మీ. | 4 అడుగుల - 5 అంగుళాలు |
| 2) 3.5 సెం.మీ. | 5 అడుగుల - 5 అంగుళాలు |
| 3) 3.6 సెం.మీ. | 5 అడుగుల - 6 అంగుళాలు |
| 4) 3.7 సెం.మీ. | 5 అడుగుల - 7 అంగుళాలు |
| 5) 3.8 సెం.మీ. | 5 అడుగుల - 8 అంగుళాలు |
| 6) 3.9 సెం.మీ. | 5 అడుగుల - 9 అంగుళాలు |
| 7) 4.00 సెం.మీ. | 6 అడుగులు (పూర్తి నిడివి) |

వయసుని బట్టి, పై ఎత్తులో కొద్ది అంగుళాలు తేడా ఉండొచ్చు!

**2) పార్శ్వ తలము :** ఇది బొటనవ్రేలి మధ్య భాగాన్ని సూచిస్తుంది. వ్యవహార జ్ఞానం, న్యాయ తర్క సంబంధ జ్ఞానాన్ని సూచిస్తుంది. ఈ భాగం గట్టిగా, పై దానికంటే పొడుగ్గా ఉంటే, వారిని వాగుడుకాయలుగా గుర్తించవచ్చు!

రెండు పార్శ్వాలూ సమానంగా ఉంటే అట్టి జాతకులు మృదుభాషి, సరళ స్వభావం కలిగినవారు.

**3) శుక్రస్థాన తలం :** ఇది జీవిత భాగాస్వామి, లైంగిక సంబంధాలు, పటుత్వం, సుఖ సంపదలు వగైరా ప్రభావితం చేస్తుంది. ఇది బలంగా ఉండే స్థితిపైననే ఇవన్నీ ఆధారపడి ఉంటాయి. ఈ ప్రదేశం వెచ్చగా తగుల్తూ గట్టిగా ఉంటే, అట్టివారు లైంగిక పటుత్వం గలవారై ఉంటారు. కొందరిలో ఇది బహు భార్యాత్వానికీ - తద్వారా కాపురంలో కలతలకూ దారి తీయవచ్చు!

ఈ శుక్రస్థానంలో నీలిరంగునాడులు పైకి తేలిగ్గా కనిపిస్తే, అట్టి జాతకుల అధి భౌతిక శక్తులు త్వరలోనే అంతరించిపోతాయి.

Ist
2nd
3rd
PHALANI

| Jupiter | Saturn | Sun | Mercury | Venus |
|---|---|---|---|---|
| | | | | |
| | | | | |
| | | | | |

**ఇతరవ్రేళ్ల సంగతులు :** వివిధ గ్రహస్థితులను గ్రహించాలంటే, కేవలం ఒక్క అంగుష్ఠ తలాలను మాత్రమే పరిశీలిస్తే సరిపోదు. అన్నివ్రేళ్ల ఉపరితలాలూ - పార్శ్వాలూ కూడా పరిశీలించాలి. పెద్ద పెద్ద జ్యోతిష్కులు సైతం, ఇవి పరిగణనలోకి తీసుకోకుండా ఫలితాలు చెప్పి, పప్పులో కాలేసిన సందర్భాలు చాలా ఉన్నాయి.

Ist
2nd
3rd
PHALANI

| Jupiter | Saturn | Sun | Mercury | Venus |
|---|---|---|---|---|
| | | | | |
| | | | | |
| | | | | |

హస్త జ్యోతిశ్శాస్త్రంలో డిగ్రీలు - నిముషాలు వంటి అతి సూక్ష్మ అంశాలకు కూడా ప్రాధాన్యత ఉన్నది.

అంగుష్ఠం మాదిరిగానే, అన్ని వ్రేళ్లనూ మూడుగా విభజించాలి. అయితే ఇక్కడ వ్రేళ్ల విభాగాలకు వేరే కొలతలున్నాయి.

మొత్తం వ్రేలి పొడుగులో 1/5వ వంతు మొదటి భాగంగాను, 1/3 వ వంతు రెండో భాగంగాను, దీనికంటే కాస్త ఎక్కువ మూడో భాగంగాను గమనించాలి. ఉదాహరణకు 10 సెం.మీ పొడుగున్న వ్రేలిలో 2.3 సెం.మీ. ఒక భాగం; 3.6 సెం.మీ. ఒక భాగం, 4.1 సెం.మీ. మరొక భాగం.

**చూపుడు వ్రేలు :** మొదటి రెండు భాగాలకూ తేడా అధికంగా ఉంటే, జాతకుడికి మత

సంబంధ - వేదాంత జ్ఞానం ఉంటుంది. మూడోభాగం పొడుగ్గా ఉంటే గర్విష్ఠి అవుతాడు.

**నడిమి (మధ్యవ్రేలు) :** రెండోభాగం కంటే మొదటి భాగం కాస్త ఎక్కువ పొడవు ఉంటే జాతకుడు పోరాట పటిమగలవాడై ఉంటాడు. మూడోభాగం పొడుగ్గా వుంటే రాజకీయవేత్త కావచ్చు!

**ఉంగరం వ్రేలు :** మొదటిభాగం, రెండోభాగం కంటే కొద్ది హెచ్చు పొడవు వుంటే జాతకుడు కళాకారుడు, అందాన్ని ఆరాధించేవాడు అవుతాడు. మూడోభాగం పొడుగ్గా ఉంటే వృద్ధ గౌరవాలకు ప్రాకులాడే వాడవుతాడు.

**చిటికెనవ్రేలు :** రెండోభాగం కంటే మొదటిభాగం కాస్త అధికంగా పొడవు వుంటే, మంచి వక్త అవుతాడు. రెండూ సమానంగా ఉంటే వంచకుడు అవుతాడు. మూడోభాగంపై రెండిటి కంటే పొడుగ్గా వుంటే వ్యాపారంలో ధనవంతుడవుతాడు.

## 26. గోళ్లను బట్టి వర్గీకరణ

సంతోషానికి గానీ, బాధకు గానీ గోరునే సూచికగా చెప్పవచ్చు! దీనివల్ల ముఖ్యంగా జాతకుని ఆరోగ్యస్థితి అంచనా వేయవచ్చునని విజ్ఞాన శాస్త్రం కూడా ధృవీకరిస్తోంది. గాయాలు - దెబ్బల నుండి రక్షణకు మాత్రమే గాక గోటి ఉపయోగాలు చాలా ఉన్నాయి. ఇక్కడ మనకు ఈ అంశంలో ఉపయోగపడేది మాత్రం - గోళ్లలో రకాలు. 12 రకాల గోళ్లు గుర్తించబడ్డాయి. (బొమ్మ చూడండి)



ప్రతి గోరు రకానికీ - సులభంగా గుర్తు పట్టేందుకు వీలుగా పేరూ - అట్టి గోరు (అంగుష్ఠానికి) ఉన్నందున కలిగే ఫలితం ఇవ్వబడ్డాయి.

**1. ఇరుకు గోరు :** ఇలాంటి సూది ఆకారపు గోరు గలవారు తెలివైనవారు. అకారణ కలహాలకు దూరంగా ఉంటారు. మధురంగా చతురంగా సంభాషించగలరు. స్పందించే గుణం అధికం. జీవితంలో విజయాలు వీరిని వరిస్తాయి.

**2. గుండ్రని గోరు :** చతురస్ర అంగుష్ఠాల మీద ఇలాంటి గోరును చూడగలం! వీరికి బలమైన భావాలుంటాయి. ఓపిక అధికం. నిర్ణయం తీసుకుంటే, నెరవేరే దాకా నిద్రించరు. స్వయంగా ఉపాధి లేదా వ్యాపారం నిర్వర్తిస్తారు.

**3. శంఖపు గోరు :** మొదట సన్నగా ఉండి అంచు చేరే కొద్దీ వెడల్పుగా మారే గోరు రకం ఇది. వీరు ఆత్మవిశ్వాసం అధికంగా గలవారు. తప్పులు వెదికే తత్త్వం. మంచి విమర్శకులుగా ఉంటారు. అయితే స్వార్థపరులు కూడా.

**4. చదరపు గోరు :** శ్రామిక జీవనులు. అన్నీ సరిగ్గా ఉండాలని భావిస్తారు. న్యాయం కోసం ప్రాకులాడతారు. జర్నలిస్టులు సాధారణంగా ఇటువంటి గోరు వర్గంలో చేరతారు.

**5. పొట్టి గోరు :** చాలా అంశాల పట్ల వీరికి కొన్ని నమ్మకాలుంటాయి. కాని అంత సంపాదన పరులు కారు. వీరిని దంత సమస్యలు బాధిస్తుంటాయి

**6. సూచిక గోరు :** శారీరక బలహీనులు. స్వయంగా ఎలాటి నిర్ణయమూ తీసుకోలేరు. ఇతరుల సలహాలు పాటించే గుణం. హృదయ సంబంధ బాధలుంటాయి.

**7. విస్తృత గోరు :** ఇట్టిగోరు కలిగిన వారు బలవంతులు. వీరికి మనోబలం కూడా అధికమే! సూటిగా మాట్లాడ్డాన్ని ఇష్టపడతారు. బయరాహిత్యం ఎక్కువ.

**8. అసమ గోరు :** లైంగికాసక్తి అధికం. బాగా చదువున్నా గర్వంవల్ల అక్కరకు రాదు. ఇతర శక్తులూ అంతంత మాత్రమే!

**9. V ఆకార గోరు :** వీరికి గొంతు బాధలు అధికం. బలహీనులే గాక సోమరులు కూడ. ఇతరులలో తప్పులు వెతుకుతుంటారు.

**10. పూర్తి గోరు :** చక్కని ఆకృతిగల గోరు. జీవితంలో పైకొచ్చే సూచన. సంస్కర్తలు. మంచి ఆరోగ్యవంతులు. శ్రేయోభిలాషులు

**11. ఊర్ధ్వ గోరు :** వీరు స్నేహితుల వల్ల లాభపడతారు. ఒకసారి ఏదైనా నిర్ణయం తీసుకుంటే కడదాకా కట్టుబడి ఉంటారు.

**12. ఖండిత గోరు :** మానసిక ఆందోళనకు సూచిక. నిరాశావాదులు.

## 27. గోరు రంగును బట్టి వర్గీకరణ

ఒక వ్యక్తి తెలుపో, నలుపో, చామనచాయలో ఉండొచ్చు! కాని అతడి గోరు రంగు వీటికి భిన్నంగానూ ఉండే అవకాశాలున్నాయి. గోళ్లకుండే ఈ రంగులను బట్టి కూడా ఫలితాలు నిర్ణయించాలి! అంతే కాదు! గోరు మందం కూడా పరిగణించాలి!

ఉదాహరణకు బాగా మందంగా, పెళుసుగా ఉండే గోరు కర్కశత్వానికి ప్రతీక ఇట్టి గోరు గలవారు మూర్ఖులై ఉంటారు. విషమాకారం గోళ్లున్నవారు నిరుపేదలు. వాడిగానూ - బాగా పొడుగ్గాను గోళ్లుండే వాళ్లు హంతకులు అయ్యే అవకాశం ఎక్కువ. లేదా అవినీతి పరులైనా కావచ్చు!




అలాగే మెరుపు గోళ్లు కలవారు అమాయకులు, నీతిమంతులు, దైవభక్తి పరులు.

**గోటిపైన మచ్చలు చూపే ప్రభావం :**

మచ్చలు, చుక్కలు గోటిపైన ఉంటే (ఇక్కడ గోరు అనేది అంగుష్ఠానికి వర్తిస్తుంది), అని మనో వేదనకు రోగానికి, ఈర్ష్యకూ, అసాధారణ స్థితులకూ, కొన్ని సందర్భాలలో ప్రమాదాలకు సంకేతాలు.

ఇప్పుడు గోటి మూలం నుంచి గోరు రంగులను బట్టి ఎటువంటి ఫలితాలు కలిగేదీ చర్చిద్దాం!

**తెలుపు రంగు :**

ఈ రంగు గోరుగల వ్యక్తులు పెద్దమనిషి తరహాగా ఉంటారు. సత్త్వగుణం ఉన్నా, రక్తలేమి వంటి రోగాలనూ సూచిస్తుంది తెలుపురంగు.

చూపుడు వ్రేలిపై తెలుపురంగు మచ్చలుంటే, ఆ జాతకుడు తెలివైనవాడు, నిపుణుడు, మనోధైర్యం గలవాడు అయి ఉంటాడు. అదే మధ్యవ్రేలిపై ఈ రంగు మచ్చలు సముద్ర ప్రయాణాన్ని లేదా విమాన ప్రయాణాన్ని (ఇతర దేశాలకు) సూచిస్తాయి. ఉంగరపు వేలిమీద యజ్ఞయాగాదుల్నీ - ప్రభుత్వరంగ పనులలో విజయాన్నీ సూచిస్తాయి. ఉంగరపు వ్రేలి గోరు మీద ఈ తెలుపురంగు మచ్చలు ధనవంతుడనీ, గాయకుడనీ, అందగాడనీ తెలుపుతాయి.

స్త్రీల విషయంలో - ఏ గోరుమీదనైనా తెల్లని మచ్చలు, వారి స్వైరవిహార సూచికలు

**ఎరుపు రంగు :**

ఎరుపురంగు గోళ్ళుగల వ్యక్తులు, ఏదైనా రోగపీడితులై ఉంటారు. గోరు మొలిచే చోట గాఢమయిన ఎరుపురంగు, విషం చేత జీవితం పరిసమాప్తమవుతుందని సూచిస్తుంది. కొందరి విషయంలో అధిక రక్తపు పోటు, గుండె సంబంధ వ్యాధులకు ఈ ఎరుపురంగు సూచిక.

బొటనవ్రేలిపై ఈ రంగు మచ్చలు హంతకుడని, చూపుడు వ్రేలుపై ఉంటే కోపిష్ఠి అనీ, ఇతర వ్రేళ్లపై ఉంటే శస్త్రచికిత్సకు తప్ప లొంగని వ్యాధుల బారిన పడే అవకాశం ఉందనీ గుర్తించాలి.

**గులాబి రంగు :**

ఈ రంగు గలిగిన గోళ్లు చక్కని ఆరోగ్య సూచికలు. ఈ జాతకులు అదృష్టవంతులు. ఉన్నత పదవులు అధిష్ఠిస్తారు. స్త్రీల విషయంలో ఈ రంగుగల గోళ్లు ఆమె విలాసవంతమైన జీవితానికీ - భర్తతో ఆమె అనుబంధానికీ ప్రతీకలవుతాయి.

ఈ రంగు మచ్చలు, అంగుష్ఠపు గోటిమీద ఉంటే శత్రు విజయాన్నీ, చూపుడు వ్రేలి మీద వ్యవహార జయాన్నీ, చిటికెన వ్రేలిపై వ్యాపార విజయాన్నీ సూచిస్తాయి.

**పసుపు రంగు :**

ఈ రంగు గోళ్లు రక్తహీనత (ఎనీమియా)కు గుర్తు. కామెర్ల రోగ సూచికలు. క్షయ, కాన్సర్ వంటి రోగాలు లేత పసుపు రంగును బట్టి ఊహించాలి. ఈ రంగు మచ్చలు ఎక్కువగా కాలేయ వ్యాధులను సూచిస్తాయి. బొటనవ్రేలి మీద ఈ రంగు మచ్చలు ఊపిరితిత్తుల వ్యాధులకు మూలమని గ్రహించవచ్చు! చూపుడు వ్రేలిపైన ఉంటే శిరోవ్యాధులు; మధ్యవ్రేలి గోరుపైన జీర్ణాశయ వ్యాధులు; ఉంగరపు వ్రేలి గోరు మీద ఉంటే

జన్యు సంబంధ వ్యాధులు, చిటికెన వ్రేలిపైన పాదాలకు సంబంధించిన లేదా నరాలకు సంబంధించిన వ్యాధులు ఉండడాన్ని సూచిస్తాయి. ఈ జాతకులపై గురుగ్రహ ప్రభావం అధికం.

**నలుపు రంగు :**

ఈ రంగు గోళ్లు గల వ్యక్తులు దివాలా తీసినవారు, నిరుపేదలు, లేదా చీట్లపేక రాయుళ్లు అయి ఉంటారు.

మూర్ఖులు, దగాకోరులు, వ్యభిచారులు, నిర్భయులు, బందిపోట్లు.... ఇట్టివారి బొటనవ్రేలి గోళ్లు పరిశీలించినట్లయితే - మనకు నల్లరంగు మచ్చలు కనిపిస్తాయి. చూపుడు వ్రేలి గోరుపైన ఇవి అవమానం, చావు తెలివితేటలు, వంచనలను సూచిస్తాయి. నడిమి వ్రేలిపై మరణాన్ని, భయాన్ని, ఓటమిని సూచిస్తే - ఉంగరపు వ్రేలి మీద వ్యాపారంలో అపజయాన్ని; చిటికెన వ్రేలి గోరు మీద వాగుడు కాయతత్త్వాన్ని సూచిస్తాయి.

**ఊదా రంగు :**

ఈ రంగు మచ్చలూ గోళ్ల మీద కనిపించడం అంత క్షేమకరం కాదు. ఈ రంగు గోళ్లు రక్తంలోను - వీర్యంలోను దోషాలకు సూచికలు. ఇలాంటి గోళ్లున్న వారు విషతుల్యాహారాన్ని భుజించే వారై ఉంటారు. పాముకాటు తిన్న వ్యక్తి గోళ్లు గమనించండి! అవి ఈ రంగుకు తిరుగుతాయి.

చూపుడు వ్రేలిపై ఇలాంటి మచ్చలు యాత్రల్లో మరణాన్ని సూచిస్తాయి. నడిమి వ్రేలి మీద ఈ రంగు మచ్చలు ప్రమాదాల్లో మరణాన్ని, చిటికెన వ్రేలి గోరుపై ఇలాంటి మచ్చలు ఆపరేషన్ల సందర్భంగా మరణాన్ని సూచిస్తాయి.

**ఆకుపచ్చ :**

ఈ రంగు గోళ్లు రక్తంలో మార్పును సూచించవచ్చు! బొటనవ్రేలి గోరు మీద ఈ రంగు మచ్చలు మనోవైకల్యాన్ని ఇతర వ్రేళ్లపై ఇటువంటివె అశుభకారకాలను సూచిస్తాయి.

**నీలం :**

ఇవి దురదృష్టానికి సూచికలు కొందరిలో ఇటువంటి రంగు గోళ్లు బ్లడ్ కాన్సర్‌ను సూచిస్తాయి.

ఇంద్రధనుస్సు రంగులు : పలు వర్ణాల్లో గోళ్లు దుస్వప్న సూచికలు.

## 28. గోటిపై అర్ధచంద్రాకృతిని బట్టి వర్గీకరణ

సాధారణంగా ప్రతి అంగుష్ఠం మూలంలోను అర్ధచంద్రాకృతి బొమ్మల్లో చూపినట్లు కన్పిస్తుంది. ఇది వివిధ ఆకృతులను బట్టి - పరిమాణాన్ని బట్టి 4 రకాలుగా ఉంటుంది.



అవి (1) అర్ధచంద్రాకారం (2) నడిమి రకం చంద్ర వంక (3) అస్పష్ట చంద్ర వంక (4) పూర్తి చంద్రాకారం. వీటి ఫలితాలు ఈ దిగువ వివరించిన రీతిలో ఉంటాయి.

1. అర్ధచంద్రాకృతి జాతకుని జననం నుంచి అర్ధభాగ జీవిత కాలం వరకు ఎదుగుదల దశను సూచిస్తుంది. ఇది శుభదాయక భావికి సూచిక. మొత్తం మీద మంచి ఫలితాలున్నట్టు చెప్పవచ్చు!
2. కానీ, ఇదే అర్ధచంద్రాకృతి మసగ్గా ఉన్నా, కనిపించక పోయినా, రక్తహీనత, లేదా చర్మ సంబంధ రోగాలతో బాధపడే దశను సూచిస్తుంది
3. అర్ధచంద్రాకృతి నడిమి రకంగా ఉంటే - అట్టి జాతకులు రహస్య గోపనం కలిగి ఉంటారు. వీరు రహస్యములు కాపాడే వారై ఉండొచ్చు!
4. గోరులో సగభాగం ఈ చంద్రవంక ఆక్రమిస్తే అది పూర్ణచంద్రాకారంగా పరిగణించాలి. ఇట్టి జాతకులు తీవ్ర స్వభావులై ఉంటారు. లేదా మానసికంగా వ్యాకులత చెందేవారై ఉంటారు రోగగ్రస్తులూ అయి ఉండొచ్చు!

## 29. అంగుష్ఠం ముడిని బట్టి వర్గీకరణ

అరచేతితో అంగుష్ఠం ముడిపడి లేదా అతుకుకొని ఉండే తీరునుబట్టి కొన్ని జాతకాలు వర్గీకరించవచ్చు! మొత్తం రెండు ముడులు (ప్రథమ ద్వితీయ పార్శ్వాలను కలిపే చోట; అరచేతిని కలిపే చోట) ఉంటాయి.




1. కొన్ని చేతులలో ఇలాంటి అతుకులు లేదా ముడులు స్పష్టంగా కనిపించే రీతిలో ఉంటాయి (బొమ్మ చూడండి!) ఇట్టి అతుకు కలిగిన వారు నిర్లక్ష్య స్వభావులు. ధనం వృధాగా ఖర్చు చేసేవారై ఉంటారు




మరికొందరిలో ఈ ముడి కష్ట జీవితానికి సూచిక కావచ్చు!

2. కొన్ని చేతుల్లో ఈ ముడులు కనిపించవు. అవి మృదువైన ముడులు లేని అతుకులు గల అంగుష్ఠాలు. ఇట్టి జాతకులకు వృత్తి లేదా పదవీ బాధ్యత నెరిగి వర్తించే గుణం, విద్యుక్త ధర్మం నెరవేర్చే గుణం ఉంటుంది. పూర్వం రాజులకు ఇలాటి అంగుష్ఠాలుండేవీ - లేనివీ చూసేవారు. కాని వీరు గొప్ప ప్రేమికులు కాలేరు. ఎ) కొందరిలో పొడుగాటి ముడి కన్పిస్తుంది. వీరికి అందమైన ఆలోచనలుం టాయి. కాని వీరు పిరికి ప్రేమికులు. వీరికి దస్తూరీ కూడా అంతగా కుదరదు. బి) సుదీర్ఘంగా ఉండే ముడి కొందరిలో కనిపిస్తుంది. వీరికి తార్కిక శక్తి ఎక్కువ. (బొమ్మను పరిశీలించండి ) వీరి దస్తూరి బాగుంటుంది. వాగ్దానాలు ఇచ్చి నెరవేర్చుకోలేని తత్త్వం వీరిది. కొందరు వక్తలు కాగలుగుతారు.

## 30. చర్మపు రంగును బట్టి వర్గీకరణ

ప్రాచీన మహర్షులు ఎంతో శోధించి, చర్మపు రంగును సైతం పరిగణనలోకి తీసుకొని, వివిధ రంగులు - వాటిలోని రకాలను బట్టి సూక్ష్మాతి సూక్ష్మమైన పరిశీలనలు చేసి ఫలితాలు చెప్పారు. కాని, నాటికాలపు ఆహారపుటల వాట్లకు - నేటి ఆహారపుటలవాట్లకు గల తేడాల వల్ల కొన్ని స్థూలమైన అంశాలను మాత్రం ఇక్కడ ఇవ్వడం జరిగింది.

1. ఎరుపు లేదా రాగి రంగు లేదా సూర్యోదయ కాంతి గల చర్మపు రంగు శ్రేష్ఠం. జాతకునికి సంపత్కరం.
2. తెలిపోతూన్నట్లున్న పసుపురంగు చర్మం - రోగకారకం.
3. తెలుపు రంగు చర్మం - సన్యాసి లేదా ఒంటరి జీవి.
4. ఎరుపు రంగు చర్మ కాంతి వున్నవారు జీవితాన్ని ఆనందంగా అనుభవించే వారై ఉంటారు.
5. నలుపు రంగు చర్మ స్వభావులు పేదరికంతో బాధపడేవారు, త్రాగుడు వంటి వ్యసనపరులయి ఉంటారు.

6. బాగా త్రాగుబోతుల చర్మం చేతి వద్ద నీలంగా ఉండడాన్ని గమనించగలం!
7. కుంకుమ వర్ణపు చర్మకాంతి గల హస్తం గలవారు తప్పక రాజుగాని, అత్యున్నతాధికారి గాని కాగలరు.
8. బూడిద వర్ణపు చేతిని కలిగి ఉన్నచో ధైర్యానికీ - తెలివికీ ప్రతీకగా చెప్పుకోవాలి.
9. బంగారు రంగు చేతిని కలిగినవారు గర్విష్ఠులు, స్వయంగా తామే అధికులమని చెప్పుకొనేవారు అయి ఉంటారు.

## 31. కేశములను బట్టి వర్గీకరణ

ఇంతకుముందు అధ్యాయాలలో వివిధ అంగుష్ఠాల ప్రమాణాన్ని - గోళ్ల ప్రమాణాన్ని పరిగణించి విభిన్నమయిన వ్యాధులు సూచితమని చెప్పడం జరిగింది. ఈ అధ్యాయంలో వ్రేళ్లపైన కేశాలను బట్టి వర్గీకరించడం జరిగింది.

1. అంగుష్ఠంపైన వెంట్రుకలు లేదా కేశములు, తెలివితేటలకు సూచికలు. ముఖ్యంగా బొటనవ్రేలి 3వ పార్శ్వంలో (వెనుకవైపు) ఇవి ఉంటాయి.
2. వ్రేళ్లపైన కేశాలుండడం తమోగుణానికి ప్రతీక. ఇవి లేకపోవడం మానవత్వ రాహిత్యానికీ - పిరికి తనానికీ సూచికలు.
3. అంగుష్ఠంపై నల్లని కేశాలుండడం అంత శుభప్రదం కాదు. ఎరుపు లేదా బూడిదవర్ణ కేశాలు ఫలప్రదం.
4. అంగుష్ఠము మీద ప్రతి మలుపు వద్దా, అట్లే ఇతర వ్రేళ్లపైనా కేశాలుంటే, అట్టివారు ఉన్నత స్థాయి కుటుంబంలోని వారై ఉంటారని చెప్పవచ్చు!
5 ప్రతి మలుపులోనూ రెండేసి కేశాలుంటే, విద్యావేత్త, వేదాంతి, తనకున్న శాస్త్ర పరిజ్ఞాన రీత్యా గర్వపడేవారు కాగలడు.
6 ప్రతి వ్రేలు మలుపులోనూ రెండుకి మించి కేశాలున్నట్లయితే ఆ వ్యక్తి పేదవాడు, పటుత్వం లేనివాడు అనవచ్చు!

## 32. దోషరహిత భవిష్యత్ చెప్పాలంటే - గమనించాల్సిన అంశాలు

పది డిగ్రీల సూక్ష్మదర్శిని పట్టుకొని పరిశీలిస్తే తప్ప ఆచూకీ దొరకని కొన్ని రకాల గుర్తులు అంగుష్ఠాలపై తిష్ఠ వేసుకొని ఉంటాయి. మామూలు దృష్టికి ఇవి అంతగా




అనకపోవచ్చు! ఒక జాతకుని భవిష్యత్‌ను చెప్పడానికి ఒక్కోసారి వీటినీ పరిశీలించవలసి రావచ్చు! (బొమ్మ చూడండి). వీటిని పరిగణించకుండా జాతకం చెప్తే, అంచనాలు తప్పే అవకాశాలూ ఉండొచ్చు! అనగా.... వీటిని నిర్లక్ష్యం చేయరాదు.

1. రింగుల్లాటి చిన్న పూసల ఆకారం, భూతద్దం పెట్టి వెతికి పట్టుకోగలిగితే, అట్టి అంగుష్ఠం గలవారు లబ్ధి పొందగలరని చెప్పవచ్చు!
2. ఆ రింగుల్లో చుక్కల్లాటి గీతలుంటే, జాతకుని స్వక్షేత్రంలో శుక్రుడున్నట్లుగా భావించాలి.
3. త్రికోణాకృతి తిరగబడి ఉన్నట్లయితే ..... కష్టజీవి, తక్కువ ఫలితం పొందేవారు అయి ఉంటారు.
4. ఇంటూ గుర్తు × కలిగి ఉన్నట్లయితే, అది ప్రేమికుల లేదా దంపతుల మధ్య ఎడబాటు సూచిస్తుంది విడాకులు కూడా సూచ్యమే!
5. సర్పాకృతి కనుక సూచితమైతే సంతాన హాని, కుటుంబమున కలహాలకు సూచిక
6. నక్షత్రం సూచితమైతే రాజకీయంగా విజయం, పదవీ యోగం.

## 33. అంగుష్ఠంపై పుట్టుమచ్చలు - పిల్లికళ్ల గుర్తులు

హస్తసాముద్రికులు అరచేతిని పరీక్షించేటపుడు, భూతద్దం పెట్టి మరీ పుట్టుమచ్చలు పిల్లికళ్ల గుర్తులు (Cat's Eye) వెతుకుతూంటారు. ఇవి కొన్ని - కొన్ని స్థానాలలో విశేష ఫలితాలు ఇస్తూ ఉండటమే దీనికి కారణం!

పరాశరహోరలో చెప్పినట్లుగా -

శ్లో ॥ *అంగనానావ వామాంగో, దక్షిణాంగే నృణాంశుభం ।*

*స్వత్వాం తిలకాభం వ లోప్నా చక్రమథాపి వ ॥* (తిలాది లాంఛనాధ్యాయ 83/2)

అని వున్నది. ఇట్టి సూక్ష్మాంశాలు పరిగణించడం వల్ల సాముద్రికుని కీర్తిప్రతిష్టలు పెరుగుతాయి. (బొమ్మ చూడండి)

పూర్తిగా నలుపు రంగులో కాని, బూడిద వర్ణంలో గాని, ఎరుపు - తెలుపు రేఖల రూపంలో గాని ఇవి కన్పించడం జరుగుతూంటుంది.

పైన ఇచ్చిన బొమ్మ రెండు భాగాల ఊహా చిత్రం. బొటన వ్రేలున్న భాగం కుడివైపుగా, చిటికెన వ్రేలున్న భాగం ఎడమవైపుగా గమనించాలి.




**వివిధ ప్రదేశాల్లో వీటి ప్రభావం :**

పురుషుని అరచేతి మధ్యభాగంలో ఇటువంటి పుట్టుమచ్చ ఉండడం శుభదాయకం. వైవాహిక జీవితం సుఖప్రదంగా ఉంటుంది. బంధువులు ఇతనికి వ్రేలు - గోరు కలిసినట్లు అతుక్కొని ఉంటారు.

మత్స్య రేఖ మీద పెసరగింజ ప్రమాణంలో పుట్టుమచ్చ ఉన్నచో, వైవాహిక జీవితంలో చిక్కులు ఎదురౌతాయి. కొంతమంది విషయంలో ఇది ధన నాశనం.

ఈ పుట్టుమచ్చ ఎడమవైపు (చిటికెన వ్రేలి వైపుగా) ఉంటే జీవితంలో ఎన్నో ఒడుదుకులు ఎదుర్కొన్న వారై ఉంటారు.

అంగుష్ఠంపైన ఊర్ధ్వ భాగంలోని పుట్టుమచ్చ / పిల్లికన్ను మేషరాశి జాతకులకు గొప్ప ధనయోగ కారిణి. ఇదే చూపుడువ్రేలిపై ఉంటే జయప్రదమైన జీవితం గడిపే వారై ఉంటారు. మధ్యవ్రేలిపై మచ్చ సౌఖ్యవంతమైన జీవితానికి సూచిక.

చూపుడువ్రేలి మీద ఎక్కడన్నా పిల్లికన్ను ప్రమాదకర గుండె జబ్బులకు కారణం కాగలదు. అయితే ఇది ఎర్రని రంగులో ఉంటే మాత్రం మేధావి.

చిటికెన వ్రేలి మీద పుట్టుమచ్చ ఇష్ట వస్తు నాశిని. ఇది లేత గులాబిరంగులో ఉంటే ఎన్నో నష్టాల తర్వాత లాభదాయిని. అంగుష్ఠం మీద ధననాశిని.

చూడుపు వ్రేలిపై ఈ రంగు పుట్టుమచ్చ వివాదకరాకం.

నడిమివ్రేలిపై పుట్టుమచ్చ విజయసాధనలో అడ్డుకుల్ని సృష్టించగలదు.

ఇక్కడొక విషయాన్ని గమనించాల్సి ఉంది ఎడమ అర్ధభాగంలో ఉండే పుట్టుమచ్చలు దుష్ఫలితాలను సగానికి సగం తగ్గించడానికి తోడ్పడతాయి. అంటే - ఈ భాగంలో పుట్టుమచ్చల వల్ల నష్టాలు తక్కువగా ఉంటాయి.

శుక్రస్థానం మీద పిల్లికన్ను గలవారికి ఎలక్ట్రిక్ షాక్ వల్ల మరణం సంభవించవచ్చు!

హృదయ రేఖ, జ్ఞానరేఖల మధ్య పిల్లికన్ను గొప్ప పేరుప్రతిష్ఠలకు సూచిక.

సూర్యస్థానం మీద నల్లని పుట్టుమచ్చ అంధత్వానికి దారి తీయవచ్చు! సామాజిక కుటుంబ కార్యకలాపాల్లో అవరోధాలైనా సృష్టించవచ్చు!

బృహస్పతి (గురు) స్థానం మీద నలుపురంగు మచ్చ మత సంబంధ కార్యకలాపాల్లో విజయాన్ని ప్రసాదిస్తుంది.

శని స్థానంలోని నలుపు రంగు పుట్టుమచ్చ ఆత్మహత్యా ప్రేరకం. లేదా దీర్ఘరోగ కారకం.

చంద్రస్థానం మీద పుట్టుమచ్చ జాతకుని వివాహ విషయమై ప్రతికూల ప్రభావాన్ని కలగజేస్తుంది.

సూర్యస్థానం మీద పుట్టుమచ్చ సంపద నాశని

దాంపత్య రేఖపై పుట్టుమచ్చ రంగుతో నిమిత్తం లేక కాపురం నరకప్రాయం చేయగలదు.

చంద్రరేఖపై పుట్టుమచ్చ దూర ప్రయాణాలలో మరణానికి కారణమవుతుంది.

చిటికెన వ్రేలి రెండో కణుపు వద్ద పుట్టుమచ్చ, జాతకుని పనికిమాలిన వాడిగా చేయగలదు.

ఇదే పుట్టమచ్చ ఇదే వ్రేలి 3వ కణుపు వద్ద ఉంటే ఆ జాతకుడు నిలువు దోపిడీకి తరచు గురి అవుతాడు.

జాతకుని అంగుష్ఠం మొదలయ్యే చోట నల్లని పుట్టుమచ్చ, అతడికి తొలి సంతానాన్ని దక్కనీయదు. ఇదే పుట్టుమచ్చ ఎర్ర రంగులో ఉంటే, అతడు ధనికుడు - దాత కాగలడు.

## 34. అరచేతిలో త్రికోణాలు, నక్షత్రాలు, చదరాలు ఇతర గుర్తులను పరిగణించి జాతకము

సందేహానికి తావులేని విధంగా కొన్ని అతిసూక్ష్మ చిహ్నాలు, హస్తరేఖలను ప్రభావితం చేస్తాయని ఈ సందర్భంగా చెప్పడం చర్విత చర్వణం కాబోదు. ఎందుకంటే ఇది శాస్త్ర

గ్రంథం. ప్రామాణికత కోసం ఒక్కో అంశాన్ని నొక్కి చెప్పాల్సి వచ్చినపుడు పునరుక్తి దోషం కాబోదు కదా!



* నక్షత్రం

Δ త్రికోణం

O బంతి

≡ సమాంతరం

× క్రాసు

▯ చతురస్రం

III గ్రిల్ ఆకృతి (బొమ్మలో చాలా స్థానాల్లో ఇవి చూపించబడ్డాయి.)

ఈ గుర్తులలో కొన్ని ఇతర రేఖలతో సంబంధం లేనివి. ప్రత్యక్షంగా గాని - పరోక్షంగా గాని సంబంధం లేకున్నా వీటి ప్రభావం మాత్రం విస్మరించరానిది.

1. నక్షత్రం చిహ్నంగాని అంగుష్ఠం పైన, పై ఉపరితలాన ఉంటే, అది శుక్రస్థానం అయితే ఆ జాతకుడు అద్భుతమైన జీవితాన్ని గడుపుతాడు. కాని రెండు నక్షత్రాలు అశుభం.

త్రికోణం విజ్ఞాన శాస్త్ర దృక్కోణానికి - తర్కానికి ఈ స్థానమున అయితే ఆయువు పట్టు వంటిది. ఇదే అంగుష్ఠం మీద ≡ సమాంతర రేఖలు వృధా చర్చలను, బలహీన శక్తులను సూచిస్తాయి. కొందరి విషయంలో ఈ రేఖలు బహుళ సోదరులకు సూచికలు.

కుడి అంగుష్ఠం పై × క్రాస్ గుర్తు, తన సమీప ప్రియతమ వ్యక్తితో ఎడబాటును సూచిస్తుంది.

2. అరచేతిలో బొటనవ్రేలు ప్రారంభంలో - నక్షత్ర చిహ్నం జాతకుల దుష్ట సహవాసాన్ని చూపుతుంది. త్రికోణం వేదాంత స్వభావాన్ని, సమాంతర రేఖలు మంచి తెలివితేటల్ని, బంతి తర్కజ్ఞానాన్ని సూచిస్తాయి.

3. చూపుడువ్రేలుపై ఉపరితలంలో - నక్షత్ర చిహ్నం విచారగ్రస్త సంఘటనకు మూలంగా వుండవచ్చు! త్రికోణం మంత్రతంత్ర శాస్త్ర ప్రవేశాన్ని సూచిస్తుంది. బంతి దైవభక్తి పరుడని గ్రహించాలి.

4. నక్షత్రం ప్రేమలో విజయాన్ని సూచిస్తుంది. త్రికోణం విజయవంతమైన రాజకీయవేత్త కాగలదంటుంది. బంతి ఆకృతి ఉన్నతోద్యోగికి సూచిక. సమాంతర రేఖలు అసూయాగ్రస్త స్వభావానికి ప్రతీక.

5. నక్షత్రం పొగరుమోతు విద్యావేత్త. త్రికోణం విజయవంత ప్రచురణలను సూచిస్తుంది. బంతి సంతృప్తికర సాధన. సమాంతర రేఖలు జీర్ణశక్తి లోపాలను సూచిస్తాయి.

6. నక్షత్రం ఏదైనా పెంపుడు జంతువు చేత మరణం లేదా ఆయుధంతో హత్యకు గురికావడాన్ని సూచిస్తున్నది. అశుభం.

7. నక్షత్రం అశుభం, త్రికోణం - శుభకరం బంతి - శుభకరం.

8. నక్షత్రం - అశుభం, త్రికోణం - తదితరాలు కూడా ఇంతే!

9 నక్షత్రంతో సహా అన్ని గుర్తులూ శుభదాయకం.

10. ఒక్క × క్రాస్ గుర్తు తప్ప మిగిలినవన్నీ శుభదాయకం

11. అన్ని చిహ్నాలూ శుభదాయకమే!

12. అన్ని గుర్తులూ మిశ్రమ ఫలితాలను అందిస్తాయి.

13. × క్రాస్ గుర్తు తప్ప మిగిలినవన్నీ మంచివి.

14. అన్ని గుర్తులూ అశుభానికి సూచికలు

15. అన్ని చిహ్నాలూ అనుకూల ఫలితాలను ఇస్తాయి.

16. అశుభదాయక ఫలితాలకు చిహ్నాలన్నీ మూలం.

17. అన్నీ మిశ్రమ ఫలితాలు ఇస్తాయి.

18. అన్నీ అశుభదాయక చిహ్నాలే!

19. నక్షత్రం గుర్తు కోపకారణంగా ఆత్మహత్యకు దారితీయవచ్చు! గ్రిల్ గుర్తు విజయసూచిక. ఆకస్మిక బాధలకు, పోట్లాటకు క్రాస్ గుర్తు ప్రతీక.

20. నక్షత్రం గుర్తు చంద్ర స్థానంలో ఉంటే ప్రయాణాల్లోనే మరణం. కొందరిలో ఇది ప్రచురణల ద్వారా విజయ సూచిక. నీటివల్ల మరణానికి గ్రిల్ గుర్తు సూచిక. క్రాస్ గుర్తు వివాదాలకు కొట్లాటలకు ప్రతీక.

21 ఒకటి రెండు అశుభదాయక చిహ్నాలు.

22. శుక్రస్థానంలో నక్షత్రం బాగా తెలిసిన దగ్గరి బంధువుల చేత మరణాన్ని సూచిస్తుంది. కొందరిలో ఇది విజయవంతమైన వివాహానికి గుర్తు. మరికొందరిలో కళ్ల బాధలు - లైంగిక బాధలు ఉంటాయి. క్రాస్ గుర్తు మూత్రపిండాల వ్యాధులకు సూచిక.

- ప్రధాన రేఖలకు అన్వయించనిదే ఈ ఫలితాలు చెప్పరాదు.